# బెంగాల్ లేంప్సు

## ఫ్లూరసెంట్ ట్యూబులు



ఎక్కడెక్కడ ప్రకాశవంతమైన
వెలుగు కావాలో అక్కడంతా అవసరం

జి.ఏ.పరశురామ్ & కో., హైదరాబాద్-4(A.P.)

## ప్రజల మనిషి

అతడు ప్రజల మనిషి
ముక్కోటి ఆంధ్రుల కలడు
'ఉక్కు' మనిషి సొంత మనిషి
ఉక్కు గుండెల వాడు
గుండెలలోపల తల్లి మనసున్న
పసి వాడు!
ఎవడన్నాడు 'ఉక్కు గుండెలు
పగి లాయని?
పగిలాయా? లేదు.
రగిలాయి!
ఎవడంటాడు
తల్లి మనసు వెల్లి పోయిందని?
ప్రజల కోసం పదవి,
పదలి ప్రళయార్కు డైన
లలిత మధుర హృదయుడే
అతడు! ఎవరన్నారు?
తెల్లారగట్ల
సూర్యుడస్తమించాడని?
ఇది నమ్మరు జనం
ఇది ఒప్పరు జనం
ముక్కోటి హృదయాల
ప్రచండార్కుడై
ఉదయించాడు
'కాకాని' నేటి ఉదయం
'ముద్దు' కాకాని
చిరంజీవి వెంకట రత్నం.
ప్రజలలోనే మెలుగు తాడు
ప్రజలలోనే వెలుగుతాడు.
దీపం లాంటి మోహం
సందేశం లాంటి నవ్వు
అతడు రాలి పోని 'పువ్వు'
నిలువెత్తు కెరటం.
అతడెత్తిన 'అభయ హస్తం'
అసువు లర్పించిన వారికై
అమర లోకానికే
వెళ్ళిందన్నది నిజం!
ఆంధ్రు లారా!
ఆ 'అభయ హస్తానికై
'కై మోడ్పు' లర్పించండి
కన్నీటి పన్నీరు జల్లండి.
మనసిప్పి విప్లవాల 'ఆరతు' లెత్తండి.
ఉదయించెను కాకాని
నేడు చిరంజీవి వెంకట రత్నం!

— వి రా జి

## ఇందిరకు ఉత్తరం

మిమ్మల్ని ఒకప్పుడు ప్రేమించాను. మీదంపాలిటి దేవతవని ఆరాధించాను. బంగ్లాదేశ్ విషయంలో మీ ధైర్య సాహసాలు, మీ మానవతా దృష్టిని మెచ్చుకొన్నాను. . . . .అయితే మాత్రం ఇప్పుడవన్నీ చెరిపి వేసుకొంటున్నాను.

(మా) ఆంధ్రుల విషయం వచ్చేటప్పటికే అంత శీతకన్ను చూపే! సి.ఆర్.పి. వాళ్లెన్ని దుష్కార్యాలు

# ఉత్తరాలు

చేస్తున్నారో తెలుసా?

మీరన్నీ తెలిసినవారు కదా! మాకు జరుగుతున్న అన్యాయాన్ని గూర్చి ఆలోచించరేమి? ఆంధ్రప్రదేశ్ ను విడగొట్టవంటూ కూర్చుంటారేమి? ఇన్నాళ్ళు తెలంగాణా వాళ్ళతో కలిసి నష్టేటట్లో మునిగిపోయా.. ఈ 'నరక కూపం' నుంచి బయట పడడానికి అవకాశం ఇవ్వరా! ఇవ్వరా! మాకు న్యాయం జరగంది ఆగదు ఈ ఆంధ్రోద్యమం. కల్లబొల్లి కబుర్లు చెప్తే వినేవాళ్ళం కాదు. మాకు జరుగుతున్న అన్యాయం దృష్ట్యా తెలంగాణ వారితో కలిసి వుండడమనేది కలలో జరిగేదని. 'జై ఆంధ్రా'.

"మోరాచరా" (యాభూగ్రు)

## ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు

12—1—73 ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్ర పండితులు శ్రీ దివాకరుని వేంకటసుబ్బారావుగారు వ్రాసిన వ్యాఖ్యచదివి, నాకు తోచిన మాటలను ఇక్కడ వ్రాయుచున్నాను :

శ్రీ పి.వి.నరసింహారావుగారి నాయకత్వాన ఆంధ్రప్రదేశమంత్రివర్గం 20—3—1972 (సోమవారం) నాడు మధ్యాహ్నం 2—30 గం.లకు హైదరాబాదులో ప్రమాణ స్వీకారం చేసెరి. ఆ ముహూర్తమునకు జాతకం ఈ క్రిందివిధంగా ఉన్నది :

| | | |
|---|---|---|
| కుజః 2°-4' శనిః 8°-15' చంద్రః 14°-8' | శుక్రః 21°-14' రాజస భావ: 7°-54' | బుధః 22°-13' రవి: 6°-24' |
| కేతుః 8°-43' కర్కాటక లగ్నం: 11°-40' | నిరయన రాశి చక్రం | రాహుః 8°-43' |
| | | గురుః 12°-55' |

| | | |
|---|---|---|
| చంద్రః | | శనిః రాహుః |
| గురుః | నవాంశ | కుజః బుధః |
| రవిః కేతుః | లగ్నం శుక్రః | |

అయనాంశ : 23 —28'—21''
సం — నెల— రోజులు
జననకాలచంద్రదశాశేషం : 6 — 10— 24

పై జాతకం గురించి యీ క్రింది మాటలు మాత్రం వ్రాయుచున్నాను.

1) లగ్నాధిపతి, దశాధిపతి యగు చంద్రుడు వర్గోత్తమాంశను పొంది, మూలత్రికోణమందు స్వనక్షత్రమగు రోహిణీ నక్షత్రంలో బలముగా నున్నాడు. అట్లే గురునికి స్వక్షేత్రం — ఉచ్చ నవాంశ, కుజునికి ఉచ్చనవాంశ, నవాంశ లగ్నాధిపతి శుక్రునికి, రవికి స్వనవాంశలున్నవి

2) చంద్రగురులు (దశాంతర్దశాధిపతులు)షష్టాష్టక దోషమునకు గురి అయిరి, లగ్న, లగ్నాధిపతులకు శుభగ్రహ సంపర్కము లేదు. పాపగ్రహ సంపర్కమున్నది.

3) ప్రస్తుతము 14—5—1973 వరకు గురు భుక్తి నడుచుచున్నది. తర్వాత శనిభుక్తివచ్చును. గోచారరీత్యా జనవరి నెలాఖరు నుండి గురుచారం మంచిది. ఫిబ్రవరిలో శని వక్రత్యాగం.

పై విషయములను బట్టి చూచినచో ప్రస్తుతం ఆంధ్రప్రదేశమునకు పట్టిన తీవ్ర పరిస్థితి తాత్కాలిక మయినదనియు, మంత్రివర్గమునకు పరవాలేదనియు తోచుచున్నది. బహుశా కొన్ని మార్పులు జరుగుట వలన ఫిబ్రవరి నెలాఖరుకి ప్రస్తుత ఆందోళనలు తాత్కాలికంగా చల్లారుట, శాంతి నెలకొనుట జరుగవచ్చునని తోచుచున్నది. రాష్ట్ర విభజన జరుగునని తోచుటలేదు.

వింజరపు భాస్కరాచార్యులు, (మాచర్ల)

* * *

## అమ్మా, ముల్కీ, మానవతి తల్లీ

అమ్మా, ముల్కీ మానవతి తల్లీ,
రాజాలు పోయినా, భరణాలు పోయినా,
నువ్వు మాత్రం ఆంధ్రుల పాలిటి
భయంకరమైన ఆభరణమై కూర్చున్నావు.

ఇంకా నీపైని ఇందిరాజీ అభిమానం
జంట నగరాలలో ఆంధ్రులకి
రెండవతరగతి పౌరులుగా సన్మానం
తరతరాల ఆంధ్రులకు తీరని అవమానం.

ఇందిరాగాంధీ పంచసూత్ర పథకం
మెజారిటీ ఆంధ్రుల సమాధులపై
మైనారిటీ తెలంగాణా విజయ పతాకం
ఆంధ్రప్రదేశ్ మనుగడకే అశనిపాతం.

నీకు 'యాదుం'దో లేదో గాని
నువ్వు మాత్రం ఏభై ఏళ్ల కిందటి తుక్కు వర్మానావి
నువ్వున్న రాజ్యంలో మేం ఉండమ్,
మేం ఉన్న రాజ్యంలో నీకు 'జాగా' లేదు.

ముక్కోటి ఆంధ్రుల ప్రతినిధులు
నీ కబంధ కౌగిలిలో నిద్రపోతున్నారు

ఇప్పటికైనా 'తెలివి' రాకపోతే
వారికి ఆంధ్రావని పాడుతుంది తిలోదకాలు

అమ్మా, ముల్కీ, మాపవతి తల్లీ
ఇప్పటికైగా నమ్మర్ని వదిలిపెట్టు
లేదా ఆంధ్ర ప్రజా వెల్లువ కదిలి
ప్రత్యేకాంధ్రకు వేయమంటావా తొలి
మెట్టు

దేవులపల్లి సన్యాసిరావు. (విశాఖపట్నం)

# ఉత్తరాలు

## పిలుపు

ఇందిరమ్మ పరిపాలనలో
దగాపడిన వో తెలుగోడా!
నరసింహం రాజనీతిలో
నలిగిపడిన వో పసివాడా!!

భాగ్యనగర నడి వీధులలో
దౌర్భాగ్యం మోపినవాడా!
సవతి తల్లి సంరక్షణలో
చావలేక బ్రతికినవాడా!!

నీ రాష్ట్రపు రాజధానిలో
నిలువ నీడ కరువైనప్పుడు
స్వార్థపరుల విషతంత్రాలకు
నీ బ్రతుకే బలియైనప్పుడు






[mcm/ac/3a tl]

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)
శుక్రవారం : 26–1–73
శ్రీపరీధావినామ సం॥ పుష్య॥ బ॥ అష్ట
సంపుటము : 66 సంచిక : 19
స్థాపితం 1908
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రికా కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు


## ఉత్తరాలు

బూజురాజు ఫర్మానాలకు
విష దంష్ట్రలు మొలిచేటప్పుడు
కలసిమెలసి బ్రతికేదెట్లా?
మనసు మనసు కలిసేదెట్లా?

పురవాసా రాజధానిలో
దోపిడీలు గృహదహనాలను
తెలంగాణా ఉద్యమమందున
తెలుగువారి జీనావన్నము

స్వార్థపరుల సమైక్యవాదుల
సంగనాచి ఉద్బోధనలకు
పదవులకై పార్టీ కొరకై
ప్రాకులాడు దుష్టశక్తులకు

పోలీసుల లాఠీదెబ్బకు
సీ ఆర్. పీ. తుపాకి గుండుకు
ఉద్యమాలు చలించిపోవని
జయభేరిని మ్రోగించాలోయ్!

సమైక్యతా బురఖాలోపల
వచ్చినన్ని అవమానాలోయ్!
కలతలతో కొట్లాటలతో
కాపురాలు సాగేదెట్లోయ్?

ఒడి లోపలి నిప్పు దాచుకుని
నిట్టూర్చే సమయం కాదోయ్!

నడుముకట్టి ఆంధ్రభూమికై
జయపతాక నెగరేయాలోయ్!

విద్యార్థులు "ఎన్జీవోలూ"
మేధావులు శ్రామిక జీవులు
ప్రతి పౌరుడు హృదయం విప్పి
"జై ఆంధ్ర"కు జై కొట్టాలోయ్.
జై ఆంధ్ర

ఇట్లు,
బొబ్బిలి విద్యార్థులు.

(62వ పేజి చూడండి)

## మనవి

ఆంధ్రలో విద్యుత్ ఇంజనీర్ల, ఉద్యోగుల సమ్మెవల్ల విద్యుత్ సరఫరా లేనికారణంగా ఈ వారం ముఖచిత్రాన్ని, మధ్య పేజీలు కొన్నిటిని అనుకున్న విధంగా పాఠకులకి అందించలేక పోతున్నాము.

'కథ అడ్డం తిరిగింది' బొమ్మల సీరియల్‌ని కూడా ఈ వారం వెయ్యలేక పోతున్నాము. —సం॥

## విషయానుక్రమణిక



ఇప్పుడైనా తెలివి తెచ్చుకోడం మంచిది
తప్పుడు సలహాలు
అంధ్రకే సంబంధించిన విధానం



తలుపులూ కిటికీలూ అన్నీ మూసిఉన్నాయి– అందులో తప్పకుండా ఎవరో సమైక్యతావాది ఉండి ఉంటాడు



ప్రత్యేకాంధ్ర ఉద్యమం వెనుక స్వార్థ శక్తులు ఉన్నాయి అంటున్నారు యాదవ్



మామూలు కమ్యూనిస్టు సిద్ధాంతమే అది యాదవ్ ఒకప్పుడు కమ్యూనిస్టే కదా!



మంత్రులు పదిమంది కావాలి
దరఖాస్తులు ఇక్కడే

# హైదరాబాద్ నోట్ బుక్

## తిరుమల రామచంద్ర

**ముఖ్యమంత్రి అడియాస!**

"ప్రస్తుత సంక్షోభం తర్వాత ఆంధ్ర ప్రదేశ్ సమైక్యం సుదృఢమవుతుంది." అన్నారు ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు ఈనెల 1 వ తేదీన 33 వ అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనం ప్రారంభిస్తూ. ముఖ్యమంత్రి ఆశాభావం సముచితమనడంలో సందేహం ఎంత మాత్రమూ లేదు కాని, ఈ సమైక్యభావ విస్తృతికి పదహారు సంవత్సరాలుగా చేసిన కృషి ఏమిటి — నాయకులయినట్టివారు, నాయకు లవుదామనేవారూను. ప్రాగైతిహాసిక కాలపు నగర రాష్ట్రాలలాగ హైదరాబాద్‌ను విస్తరింపజేయడమేనా? ఏవీ రెండు సంవత్సరాల క్రితం సమైక్య కవితలు ఆలపించిన కవి గండకోయిలలు? వాటి గొంతులు మూగవోయినా? ఆంధ్రప్రదేశాను అధిష్ఠించిన నరసింహమూర్తులు ముగ్గురూ ఏకమై ముఖ్యమంత్రిగా మూర్తిదాల్చారని ఎలుగెత్తి చాటిన ఆస్థానకవి సమైక్య గీతాలు ఆలపించరేమి? ముఖ్యమంత్రి మాత్రమే కాక, తక్కిన నాయకులూ సమైక్య సాధనకు కలిగిన సదవకాశాలను ఎన్నిటిని చేజేతులా జారవిడువలేదు? పంచ సూత్ర పథకం ప్రకటించగానే, నాగలాపురం నుంచి నాగావళి వరకు, విజయనగరం నుండి భాగ్యనగరంవరకు మెరుపు పర్యటనలు చేసి జనానికి ఎందుకు నచ్చచెప్పలేదూ అంటే?—అన్నారు ఒక శ్రోత. ఉభయ ప్రాంతాలవారూ విడిపోవచ్చుననేది నేతలా లన్నమాటే. అయినప్పుడు ఇప్పుడు దిక్కేమిటి?—అంటున్నది ప్రజాసామాన్యం.

**ప్రత్యేక శిక్షణ**

సి. ఐ. డి. క్రయిమ్స్ బ్రాంచి పోలీసు సూపరింటెండెంటు శ్రీ పి. వి. రంగయ్య నాయుడు నేరాల పరిశోధన విషయమై స్కాట్‌లెండ్ యార్డ్‌లో ప్రత్యేకశిక్షణకు డిసెంబర్ చివరివారంలో బయలుదేరినప్పుడు మిత్రులు, ఆప్తులు, అధికారులు ఆయనకు బేగంపేట విమానాశ్రయంలో ఆదరంతో వీడ్కోలివ్వడం ఉచితంగానే ఉంది. శ్రీ రంగయ్యనాయుడు రాష్ట్రంలో వివిధ పోలీసు విభాగాలలో బాధ్యతగల పదవులు నిర్వహించినట్టివారు. నూతన శిక్షణతో తమ శక్తియుక్తులకు మరింత మెరుగుదిద్దుకొని, క్షేమంగా స్వదేశానికి తిరిగివచ్చి, రాష్ట్రంలో నేరాల నివారణ, విచారణలలో ఎంతో సేవ చేయగలరనడంలో సంశయమే లేదు.

**నేత్రదానం**

పేదవారికి తమ కళ్ళు పీకియిచ్చిన అపూర్వ సాహసదాన గాథలు మన ప్రాచీన సాహిత్యంలో కొల్లలు. బుద్ధుడు తన పూర్వజన్మంలో గుడ్డివాని చూపుకోసం నేత్రదానం చేసినట్టు జాతక కథలు తెలుపుతున్నాయి. ఈ నేత్రదాన సంప్రదాయం పాటించారు శ్రీమతి గోమిబెన్ కపాడియా. ఈమె నేత్రనిధి సంఘకార్యదర్శి శ్రీ టోకర్షి లాల్‌జీ కపాడియా వదిన. వయస్సు 75 సంవత్సరాలు. తన మరణం ముందు తన కళ్ళను సరోజినీదేవి నేత్ర వైద్యశాలకు దానమిచ్చారు.

**భూ భౌతికశాస్త్ర ప్రగతి :**

డిసెంబర్ 30 వ తేదీతో సమాప్తమైన భూ భౌతికశాస్త్ర పరిశోధన రజతోత్సవంవల్ల ప్రజాసామాన్యం ఎంతో తెలుసుకోవలసి వుంది. భూకంపాలు, వరదలు, అనావృష్టులు, తుఫానులు, విద్యుచ్ఛక్తి, పెట్రోలు, భూగర్భజలం, ఖనిజాలు, మొదలయిన, మానవుని కివి అతి ముఖ్యమైన అంశాలకు సంబంధించింది ఈ పరిశోధన. వీటిపై గోష్ఠులు, చర్చలు, విమర్శలు, వివరణలు డిసెంబర్ 27 నుంచి మూడు రోజులపాటు నగరంలోని నేషనల్ జియో



గత డిసెంబర్ 29, 30 లలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సు కళాశాల భవనంలో జరిగిన తృతీయ అఖిల భారత భాషావేత్తల మహాసభ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన వైస్ ఛాన్సలర్ శ్రీ ఎన్. నరోత్తమరెడ్డి ప్రసంగిస్తున్న దృశ్యం. ఎడమనుంచి మాజీ వైస్ ఛాన్సలర్ డాక్టర్ డి. ఎస్. రెడ్డి, మధ్యన ఉన్నవారు ఆహ్వానసంఘాధ్యక్షుడు డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి (లింగ్విస్టిక్స్ ప్రొఫెసర్ (ప్రిన్సిపాల్)

ఫిజికల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ భవనంలో జరిగాయి. ఇండియన్ నేషనల్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ అధ్యక్షుడు శ్రీ బి. ఆర్. శేషాచార్ ఈ ఉత్సవాలను ప్రారంభించారు. సదస్సుకు శ్రీ ఎస్. ఎన్. సేన్‌గుప్త అధ్యక్షత వహించారు. ఈ సదస్సు సూచనలను ప్రజలు ఉపయోగించుకోవాలి.

**భాషావేత్తల మహాసభ:**

డిసెంబర్ 29, 30 తేదీలలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జరిగిన అఖిల భారత భాషావేత్తల తృతీయ మహాసభ విద్యావేత్తలకు, విద్యార్థులకు కనువిప్పు కలిగించిందనే చెప్పాలి. ఉస్మానియా విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలరు డాక్టర్ డి. ఎస్. రెడ్డి ప్రారంభోత్సవం జరుపుతూ, మాతృభాషల బోధనలో భాషావేత్తల సూచనలను అనుసరించాలన్నారు. వేలకొలది పాఠశాలలు స్థాపించగా, ఫలితం కలుగనిపోవడానికి కారణం అప్పు పద్ధతిలో బోధనమే అయిన అన్నారు. ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన వైస్ ఛాన్సలర్ శ్రీ నరోత్తమరెడ్డి తన ప్రసంగంలో భాషకలిపేదే కాక, విడదీసేది కూడా నని అన్నారు. డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి స్వాగతం చెప్పారు. దాదాపు 200 మంది భాషావేత్తలు పాల్గొన్న ఈ మహాసభ 10 వర్గాలుగా ఏర్పడి భాషకు సంబంధించిన వివిధ విషయాలు చర్చించింది. 30 వ తేదీన భాషాప్రణాళికా రచన అన్న విషయమై డాక్టర్ సి. డి. దేశ్‌ముఖ్ అధ్యక్షతన జరిగిన గోష్ఠిలో భాష సహజంగా రూపొందుతుందనే మాత్రం పై ప్రణాళికారచన జరుగాలని విద్వాంసులందరూ అభిప్రాయపడ్డారు. భాషాప్రణాళికా రచనలో ప్రభుత్వం భాషావేత్తల సహకారం పొందాలని దేశ్‌ముఖ్ సూచించారు.

**డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి**

అఖిలభారత భాషావేత్తల తృతీయ మహాసభ వైభవోపేతంగా జరిగిన శ్రేయస్సు డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తిదీ, ఆయన బృందానిదీని. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కాలేజీ కళాశాల ప్రిన్సిపాలుగా, లింగ్విస్టిక్స్ శాఖాచార్యుడుగా ఉన్న డాక్టర్ కృష్ణమూర్తి విద్యార్థిదశ నుంచీ యోగ్యమైనవారికి, ఆయన అనుదినం భాషాశాస్త్ర పరిశోధనరంగంలో సాధించిన కృషి ఆశ్చర్యంకలిగిస్తుంది. ఇంకా 45 ఏళ్లకూడా నిండని ఈయన నేడు దేశంలోని అగ్రశ్రేణి భాషావేత్తలు కొందరిలో ఒకడు. విద్యార్థిదశనుంచే మహామేధావి ఫుల్‌బ్రైట్ రాక్‌ఫెల్లర్ స్కాలర్‌షిప్పులతో పెన్సిల్‌వానియా, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయాలలో ప్రొఫెసర్ ఎం. బి. ఇమెన్యూవద్ద అధ్యయనంచేసి, డాక్టరేట్ పుచ్చుకొన్నారు. అమెరికాలోని పెక్కు విశ్వవిద్యాలయాలలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉన్నారు. వేంకటేశ్వరవిశ్వవిద్యాలయంలో రీడరుగను, ఉస్మానియాలో టాగోర్ ప్రొఫెసర్‌గాను, 1970-71 లో లింగ్విస్టిక్ సొసైటీ అధ్యక్షుడుగాను ఉన్నాడు. తెలుగు వర్బల్ బేసెస్—తెలుగు మూలధాతువులు—తెలుగు వృత్తిపదకోశం, మొదలయినవి ఆయన పరిశోధనారచనలు పెక్కు అంతర్జాతీయ సభలలో అసంఖ్యాకమయిన పరిశోధన వ్యాసాలు చదివి మన్నన పొందారు.

విద్యార్థులకు ఆత్మవిశ్వాసం కలిగించే అపూర్వ సరస గంభీరాకృతి, భాషా విజ్ఞానంలో తలస్పర్శి అయిన పాండితి, అట్టే తెలియజేసే బోధనాచాతురి వున్న డాక్టర్ కృష్ణమూర్తి తన విధులను ఉభయ తారకంగా నిర్వహిస్తూ మన్నన పొందడంలో వింతేముంది?

**ఉపశ్రుతి**

ఆంధ్రప్రాంతంలో జరిగినంత తీవ్రంగా ఉద్యమం తెలంగాణాలో ఎందుకు జరగడం లేదు? నాయకులు ఎందుకు ప్రోత్సహించడం లేదు? అని అడిగాడు ఒక పెద్దమనిషి నన్ను. ప్రోత్సహించడం ఎందుకు? నేను కటికి ఒక పెండ్లి పెద్ద తనభార్యతో అన్నాడట— అమ్మీ నువ్వు పనిచేసి ఒళ్ళు విరుచుకోకు. పెళ్ళికివచ్చినవాళ్ళే చేసుకుపోతారులే—అని. ●

## అగ్రశ్రేణి సినీనటులకి అభిమానసంఘాల హెచ్చరిక!

కాకినాడ ఫిలింఫాన్స్ సంఘం సమావేశం శ్రీ డి. వి. ప్రసాద్‌బాబా అధ్యక్షతన యిటీవల జరిగింది.

శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ ఎస్. వి. రంగారావు వంటి అగ్రశ్రేణి నటుల అభిమానులు అటు తెలంగాణాలోనూ, యిటు ఆంధ్రలోనూ కూడా రాష్ట్ర ఏర్పాటుని కోరుతూ ఉంటే ఆ నటులు ఆంధ్రప్రదేశ్ విభజన కోర్కెకు మద్దతు ప్రకటించక పోవడం శోచనీయమని పేర్కొంటూ సమావేశంలో తీర్మానించారు.

జనవరి 10లోగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోర్కెకు వారు మద్దతు ప్రకటించక పోయినట్లయితే వారు నటించిన చిత్రాలని కాకినాడలో ప్రదర్శించడానికి ఫిలింఫాన్స్ అనుమతించబోదని సమావేశం హెచ్చరించింది. ఈ నటులు ఉన్న చిత్రాలను పంపిణీ చేయవద్దని పంపిణీదారులకు, ప్రదర్శించవద్దని ప్రదర్శకులకు కూడా విజ్ఞప్తి చేసింది. మిగతా జిల్లాలలోని ఫిలింఫాన్స్ సంఘాలు కూడా యిలాంటి నిర్ణయాలనే తీసుకోవాలని కూడా సమావేశం విజ్ఞప్తి చేసింది.

శ్రీ జి. హనుమంతరావు (ఎస్.వి. ఆర్. సంఘం), శ్రీ టి. కోటయ్య (ఎ.ఎన్.ఆర్. సంఘం), శ్రీ వి. చిరంజీవిరావు (ఎన్.టి ఆర్. సంఘం) ప్రసంగించారు.

కాకినాడలోని వివిధ ఫిలింఫాన్స్ సంఘాలు చేసిన తీర్మానాన్ని అమలు జరపడంలో సహకరించవలసిందిగా జిల్లా విద్యార్థులకు జిల్లా విద్యార్థి కార్యాచరణ సంఘం అధ్యక్షుడు శ్రీ డి. విక్టర్ ఇమ్మాన్యుయల్ విజ్ఞప్తి చేశారు.

—పి. వి.




'మన ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్రం కోసం జరుగుతున్న ఆందోళన యొక్క తీవ్రతను రాష్ట్రప్రభుత్వం ప్రధాన మంత్రి ఇందిరాగాంధీకి పూర్తిగా తెలియనివ్వడం లేదు, అందుచేతనే ప్రధానమంత్రి యీ సమస్య పరిష్కరించడానికి ఆలస్యం చేస్తున్నది' అని కొందరు ఆంధ్ర నాయకులు అంటున్నారు' అన్నాడు చిదంబరం.

'రాజు మంచివాడే కాని మంత్రి చెడ్డవాడు అంచేత రాజ్యంలో జరిగే అన్యాయాలన్నింటికీ మంత్రే కారణం అని చిన్న పిల్లలు చెప్పుకొనే కథల్లాగ ఉన్నాయా మాటలు' అంటూ చూడామణి యింకా యిలాగ అన్నాడు.

'రాష్ట్రంలో జరుగుతున్న సంగతులు ముఖ్యమంత్రి చెపితేనే ప్రధాన మంత్రికి తెలుస్తాయి లేకపోతె తెలియవు అని యెవరైనా అనుకొంటే, వాళ్ళు చాలా పొరపడుతున్నారు. మన రాష్ట్రంలోనే కాదు దేశం మొత్తం మీద యెక్కడెక్కడ యేం జరగుతున్నదీ, యెవరెవరు యేం చేస్తున్నదీ వెంట వెంటనే ఆమె తన స్వంత మార్గాల ద్వారా తెల్సుకొంటుంది కాని యిటువంటి విషయాల్లో ఆమె యే మాత్రం అశ్రద్ధ చెయ్యదు.

కాంగ్రెసుపార్టీ చీలిపోయిన తరువాత 1971వ సంవత్సరంలో లోక్‌సభకు యెన్నికలు జరిగాయి. ఆ యెన్నికలకు ముందు ప్రతి నియోజక వర్గానికీ, ఆ నియోజక వర్గంలో ఉండే ప్రముఖ వ్యక్తులు వాళ్ళ పుట్టుపుర్వోత్తరాలు వగైరా వివరాలు అన్నీ సేకరించి ఆమె ఒక జాపితా తయారు చేయించింది. ఎన్నికలకు తమ పార్టీ అభ్యర్థులను నిర్ణయించడానికి జరిగిన సమావేశాల్లో ఆమె ఆ వివరాలను వెల్లడించేసరికి మిగిలిన నాయకులందరూ తెల్ల మొగం వేశారు తమ రాష్ట్రంలో తమకు కూడా తెలియని విషయాలను ఆమె చెప్పేసరికి చవాన్. జగజీవన్‌రావ్ వంటి నాయకులు ముక్కు మీద వేలు వేసుకొన్నారు అందుచేత ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమం తాలూకు ఆందోళన వివరాలు ఆమెకు పూర్తిగా తెలియడం లేదనుకోవడం చాలా అవివేకం. ఒకవిధంగా యిది ప్రధానమంత్రి ఇందిరాగాంధీ సామర్థ్యాన్ని అవమానించడం కూడా అవుతుంది' అన్నాడు చూడామణి

'అన్ని వివరాలు తెలుస్తున్నట్లయితే, యీ సమస్య పరిష్కరించడానికి యెందుకు ఆమె ఆలస్యం చేస్తున్నది?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'5–1–1973 తేదీని బెంగుళూరు విమానాశ్రయంలో ఆమె ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని గురించి మాట్లాడుతూ ఉద్రేకాలు తగ్గి ప్రజలు ప్రశాంతంగా ఉన్నప్పుడే యిటువంటి విషయాల్లో నిర్ణయాలు జరగాలి' అని అంది కాబట్టి యీ ఆందోళన తగ్గిన తరువాత యీ సమస్యను పరిష్కరిద్దామని ఆమె అనుకొని ఉండవచ్చును' అన్నాడు వంచప్రాపు

'ఆమె మాటలు వినగానే, ఒక యింటి యజమాని చెప్పిన సమాధానాలు నాకు జ్ఞాపకం వచ్చాయి' అన్నాడు చూడామణి.

'ఏమిటా సమాధానాలు?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.




# క్రొత్త త్రివిధోపయుక్తమైన డెట్

క్రొత్త డెట్ హెచ్చు తెల్లని పొడరు—దుస్తులను తెల్లగా ఉతుకుటకు మేలు రకపు తెలుపుచేసే పదార్థము కలది.

క్రొత్త డెట్‌కు అదనముగా శుభ్రపరచే శక్తి ఉంది. అంటివున్న మట్టిని కూడ వదిలించి, రంగు బట్టలను అత్యంత ప్రకాశవంతముగా చేస్తుంది.

క్రొత్త డెట్‌లో సమృద్ధిగా నురుగు వచ్చే పదార్థముంది. అది బట్టలకు ఎంతో నిరపాయమైనది, చేతులకు ఎంతో మృదువుగా ఉంటుంది!

క్రొత్త సైజులు: డెట్ 200, 400, 600, 800, 1000 ప్యాకెట్టులు మరియు డెట్ సంచీ.




ఇంకొక నాణ్యమైన డెట్ తయారు




## డెట్ బిళ్ల

సబ్బు కంటె 1½ రెట్లు ఎక్కువ బట్టలను ఉతుకుతుంది, పూర్వము ఎప్పటి కంటె అతి తెల్లగా—మంచి నీళ్లు లేక ఉప్పు నీళ్లలో.

Shilpi HPMA 42A/72 tel

# ముగ్గురుమహర్షులు

'అప్పారావు ఒక యింట్లో అద్దెకు ఉంటున్నాడు. ఒకప్పుడు వర్షం కురియగా యిల్లు కారడం ప్రారంభించింది.

అప్పుడు అప్పారావు యింటి యజమాని దగ్గరకు వెళ్లి 'అయ్యా యిల్లు కురుస్తున్నది. అందుచేత ఒకసారి యిల్లు నేయించండి!' అని అడిగాడు.

'వర్షం యిలాగ కురుస్తుండగా, యిల్లు యెలాగ నేయించమంటారు, చెప్పండి?' అని యింటి యజమాని అప్పారావును ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు అప్పారావు యేమీ సమాధానం చెప్పలేకపోయాడు.

రెండు రోజుల తరువాత వర్షం తగ్గిపోయి, యెండ బాగా కాస్తున్నది.

అప్పారావు అప్పుడు మళ్లా, యింటి యజమాని దగ్గరకువెళ్లి 'అయ్యా! యిప్పుడు వర్షం కురియడం లేదుకదా! అందుచేత యిప్పుడు యిల్లు నేయించండి!' అని అడిగాడు.

ఆ మాటకు యింటియజమాని 'అప్పారావుగారూ! యిప్పుడు వర్షం కురవడం లేదుకదా! అయినప్పుడు యిల్లునేయించడం యెందుకు చెప్పండి?' అని తిరిగి సమాధానం యిచ్చాడు' అంటూ యింటి యజమాని సమాధానాలను వివరించాడు చూడామణి.

'అయితే, ఆ యింటి యజమాని సమాధానాలకూ, ఇందిరాగాంధీ మాటలకూ పోలిక యేమిటి?' అని అడిగాడు చంచ్రలావు.

'ఆ యింటి యజమాని వర్షం కురుస్తున్నప్పుడు 'యిప్పుడు యిల్లు నేయించడం యెలాగ?' అని తప్పించుకొన్నాడు. వర్షం కురవనప్పుడు అతను 'యిప్పుడు యిల్లు నేయించడం యెందుకు?' అని ప్రశ్నించాడు.

అలాగే ఇందిరాగాంధీకూడా ఆందోళన జరుగుతున్నప్పుడు, 'ఉద్రేక పూరితమైన వాతావరణంలో యిటువంటి విషయాలను నిర్ణయించకూడదు' అని ఆమె యిప్పుడు తప్పించుకొంటున్నది.

ఈ ఉద్రేకాలు తగ్గిపోయిన తరువాత ఆమె 'యిప్పుడు ఆ విషయాలను మళ్ళా కదిలించడం యెందుకులెండి!' అంటూ ఊరుకోవచ్చును. కాబట్టి ఆందోళన జరుగుతున్నప్పుడే యీ సమస్య పరిష్కరించబడక పోతే, ఆందోళన జరగనప్పుడు యీ సమస్య పరిష్కరించ బడుతుందనే హామీ యేమి టుంది? ప్రజలు యే ఆందోళనా చేయకుండా ప్రశాంతంగా ఉన్నప్పుడు ఆమె యే సమస్యనైనా పరిష్కరించిందేమో చెప్పు! అని అడిగాను చూడామణి.

'కొద్ది సంవత్సరాల్లో తీరిపోయే ముల్కీ నిబంధన మూలంగా మొత్తం రాష్ట్రాన్ని చీల్చడం యెందుకు? ఈ కొద్ది సంవత్సరాలు ఆంధ్రులు ఓపికపడితే, సరిపోతుంది కదా!' 'అనే భావం కొంతమందిలో బలంగా ఉంది' అన్నాడు చిదంబరం.

'అవును కేంద్ర ప్రభుత్వాధికారి గోవింద నారాయణ్ 8–1–73 వ తేదీని హైదరాబాదులో మాట్లాడుతూ 'రాజధాని నగరంలో 1977 తోను, తెలంగాణా జిల్లాలలో 1980 తోను ముల్కీ నిబంధనలు తీరిపోతాయని ప్రధానమంత్రి పార్లమెంటులో ప్రకటించారు. అంతకన్నా పెద్ద హామీ యేమి కావాలి?' అని అడిగాడు' అంటూ చంచ్రలావు చిదంబరాన్ని సమర్థించాడు.

'ప్రధానమంత్రి హామీకంటే, యేమి కావాలి? అని గోవిందనారాయణ్ వేసిన ప్రశ్న వినగానే నాకు ఆదిభట్ల నారాయణ దాసు అటువంటి ప్రశ్నకు చెప్పిన సమాధానం నాకు గుర్తువచ్చింది

'ఏమిటా సమాధానం?' అని చిదంబరం అడగ్గా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక వేసవికాలంలో ఆదిభట్ల నారాయణ దాసు, ఒక రాజావారితోపాటు విశ్రాంతి కోసం ఊటీ వెళ్ళారు.

ఒక సాయంత్రం రాజావారు కారులో షికారుకు బయలుదేరుతూ దాసుగారినికూడా తమతో రమ్మన్నారు.

'ప్రభూ! నాకు కారు ప్రయాణం అంటే భయం' అంటూ నారాయణదాసు నసిగాడు.

'దాసుగారూ! మేము స్వయంగా కారు నడుపుతుండగా మీకు భయమెందుకు?' అని రాజావారు ప్రశ్నించారు.

'అవును, ప్రభూ! అదే నా భయం' అని నారాయణదాసు వెంటనే సమాధానం యిచ్చాడు. అంటూ చూడామణి యింకా యిలాగ అన్నాడు.

'రాజావారు కారు నడపడమే నారాయణ దాసుకు భయం కలగడానికి కారణం అయింది. అలాగే ప్రధానమంత్రి ఇందిరా గాంధీ హామీ యివ్వడమే ఆంధ్రుల అనుమానానికి కారణం'

'ఇందిరాగాంధీ యిచ్చిన హామీని ఆంధ్రులు యెందుకు అనుమానించాలి?' అని అడిగాడు చంచ్రలావు.

'ఇందిరాగాంధీ చెప్పే మాటలకు చేసే పనులకూ యేమీ సంబంధం ఉండదు. మత తత్వాన్ని, మతతత్వ పక్షాలను ఖండిస్తూ ఆమె అహోరాత్రులు ఉద్ఘాటనలు చేస్తూనే ఉంటుంది. కాని మంజేరి నియోజకవర్గంలో జరుగనున్న లోక్‌సభ ఉపయెన్నికల్లో కాంగ్రెసుపార్టీ పచ్చి మత తత్వ పక్షమైన ముస్లింలీగును బలపరుస్తూ ఉంది.

6–1–73 తేదీని యీ విషయాన్ని కొంతమంది పత్రికా విలేఖరులు ఆమెను ప్రశ్నించారు.

'అది కేవలం స్థానికమైన విషయం' అని చెప్పి ఆమె తప్పించుకొంది.

అలాగే 1977లో కూడా ఆమె యిది వరకు హామీయిచ్చిన మాట వాస్తవమేకాని అప్పటికి యిప్పటికీ కాలం మారిపోయింది. పరిస్థితులు మారిపోయాయి. ఆ మారుతున్న పరిస్థితులతోపాటు మనంకూడా మారాలి. అదే అభ్యుదయం. అంతేకాని యెప్పుడో అన్న మాటలను పట్టుకొని యిప్పుడు ప్రాకులాడకూడదు. అంటూ ముల్కీ నిబంధనల గడువును మళ్లా పొడిగించవచ్చును. అందుచేత ఈ విషయాన్ని ఆంధ్రులు శ్రద్ధగా ఆలోచించవలసి ఉంది' అన్నాడు చూడామణి.

మిగిలిన విషయాలు యింకోసారి మాట్లాడుకోవచ్చును' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. (9–1–73) ●

రోజూ ఒక చెంచా

# రక్తమును, ఎముకలను మరియు కళ్ళను పటిష్టము చేస్తుంది.

SYRUP MINADEX GLAXO

రోజూ ఒక చెంచాడు మినాడెక్స్ సరియైన పరిమాణములో ఈ క్రింది వాటిని సమకూర్చుతుంది.

విటమిన్ ఏ—మంచి కను దృష్టికి.

ఐరన్—ఆరోగ్యకరమైన రక్తమునకు.

విటమిన్ డి—దృఢమైన ఎముకలు మరియు అంటు వ్యాధి నిరోధక శక్తి.

మూడంతల ఆరోగ్య రక్షణ కోసం మీ బిడ్డకు నారింజ సువాసన గల్గిన మినాడెక్స్ రోజూ ఒక చెంచాడు ఇవ్వండి.

నెలకు రు.5 కంటె తక్కువ ఖర్చుతో!

170 మిలి—రు. 4.55

340 మిలి—రు. 7.86

పన్నులు అదనం

గ్లాక్సో

సిరప్

## మినాడెక్స్

ఒకే చెంచాలో మూడు గుణములుగల టానిక్

# ఒక వారం విపరీతం

### ఫాలాక్షుడు

## లారీ ప్రమాదం

వాలాజా తాలూకా చిన్నంపల్లి గ్రామానికి చెందిన 60 ఏళ్ళ అబ్బాస్ గఫూర్ తన ఎద్దు బండిని తోలుకుపోతుండగా రాణీపేట ప్రాంతంలో ఆబండిని ఓ లారీ ఢీకొట్టేసిందట ఫలితంగా ఆయన పేగారు ఆస్పత్రిలో చికిత్సకు ఫలితంలేక చనిపోయారట — అయిదురన్నం ప్రయుచ్ఛతి అన్నది ఇందుకే

### ఆవేశంలో ఘోరం

కేరళకు చెందిన పాలఘాటు జిల్లాలోని పుప్ప కురందార అనే గ్రామంలో 50 ఏళ్ళ స్వామి అనే అతను తనకు సంపద 75 ఏళ్ళ లక్ష్మి సొంత పతిని, తన అక్క కొడుకు 16 ఏళ్ళ కార్తియాయినిని కొంచం కత్తితో నరికేసి, ఆ యింటికి నిప్పు అంటించి పారిపోయాడట స్వామి యింట్లో సారా వ్యాపారం వుంది. తప్పుంటుందన్న గొడవలతో వచ్చిన ఆవేశం వల్ల యీ ఘోరం జరిగిందట

### కారుషెడ్డులో శవం

బెంగుళూరు చిన్నయిన్‌పాలెంకు చెందిన 13ఏళ్ళ బాషా అనే కుర్రాడి శవం ఎల్గిన్‌గార్డెన్‌లోని వోయింటి కారు షెడ్డులో వుందట ఆ కారు షెడ్డులో చూరుకు వేలాడుతూ వుందట బాషా ఆ యింట్లో దొంగతనం చేశాడని, ఆ యింట్లో వారతన్ని పట్టుకుని, ఆ షెడ్డులో పెట్టి తాళం వేసి, పోలీసు రిపోర్టిచ్చే పరికి అతను వురిపోసుకున్నట్టూ పోలీసుకు వివరాలు చేరాయట

### తోటలో ఆత్మహత్య

బెంగుళూరు ఆంధ్రకాలనీకి చెందిన 23 ఏళ్ళ వెంకటేశయ్య అనే ఆయన కృష్ణరాజపురంలోని వో తోటలో విషం త్రాగి, అక్కడే పడి, చనిపోయాడట. ఆయన చేసిన యీ పనికి కారణం ఏమిటో పోలీసు వెతుకుతోంది

### అక్రమసంబంధం తెచ్చిన ముప్పు

వేలూరుకు చెందిన వో వూరులో 28 ఏళ్ళ పరమశివన్ అనే అతనిభార్య 22 ఏళ్ళ కణ్ణమ్మకు అదే వూరుకు చెంది 24 ఏళ్ళ శ్రీనివాసన్ అనే అతనికూ అక్రమసంబంధం వుందట. ఈ విషయం తెలుసుకున్న పరమశివన్ నేరుగా పొలంలో పని చేసుకుంటున్న శ్రీనివాసన్ దగ్గరకు వెళ్ళి అతన్ని తరిమి పట్టుకుని, కత్తితో పొడిచి చంపేసి,సినిమాకెళ్ళొస్తున్న భార్యను ఆ పొలందగ్గరకు వెళ్ళి యింటికిరమ్మని, కూడా తీసుకువెళుతూ, మధ్యమార్గంలో ఆమెను కూడా పొడిచి చంపి, రక్తంతో తడిసిన కత్తితో తిన్నగా పోలీసుస్టేషనుకు వెళ్ళి లొంగిపోయాడట.

### ముసలమ్మ పెళ్ళి మోజు

తనభర్త పరమపదించాక, 70 ఏళ్ల రూవెంగ్ సిడి అనే యువతి 64 సంవత్సరాల వయస్సున్న ఒకాయనను రెండో పెళ్ళి చేసుకుందట. చేసుకున్న కొన్ని నెలలకు తాను గర్భిణినని ప్రకటించిందట ఆవూరి లేడీ డాక్టర్లు, మంత్రసానులు ఆమెను పరీక్షించి, అది నిజమని తేల్చారట ఆమె అయిదు నెల్ల గర్భిణట [illegible] సు ఖమరాంద్రుడూ కూడా వుప్ప రూవెంగ్‌సిడికి 53 ఏళ్ళ కొడుకొకడు కూడావున్నాడట ఈ విడ్డూరం బ్యాంగ్‌కాక్‌కు చెందినది. ఇంతకుముందు 1956లో రత్ అలిన్ కిస్నర్ అనే ఆమె తన 57వ ఏట గర్భిణిఅయి, ప్రపంచ రికార్డు స్థాపిస్తే, రూవెంగ్ సిధి తన 70వ ఏట గర్భవతి అయి పాత రికార్డును ముక్కలు చేసి పారేసిందట. హావురా!



### మంచి నీళ్లివ్వకపోతే...!

14వ తేదీన ఢిల్లీలో మున్షీరామ్ అనే వ్యక్తి వో హోటలుకువెళ్ళి గుక్కెడు మంచినీళ్ళిమ్మని అడిగితే అక్కడివారు నిరాకరించారట దాంతో అతనికి కోపం వచ్చి, చర్రున కత్తితీసి ఆహోటలు సొంతదారు రామ్‌లాల్‌ను పొడిచి పారిపోయాడట. అనకూడదుగానీ ఇండియాలో కూడా కొన్ని యీ రకం తమాషాలు జరుగుతూనే ఉన్నాయి. యున్నైటెడ్ ఇండియా యునైటెడ్ కింగ్డమ్ ఇంగ్లండ్!

### పిడుగుపడి తల్లీ బిడ్డల మరణం

గుడియాత్తం తాలూకా పరవక్కాడు గ్రామంలో అమృతం అనే ఆమె తన రెండేళ్ళ కొడుకును పొలంలో వేలిమీద కొబ్బరి గడ్డి పరిచి పడుకోబెట్టి పక్కన తానూ పడుకున్నదట ఆపక్కన రత్నం అనే ఆయన కొట్టిన వో చెట్టు హఠాత్తుగా విరిగి వారిమీద పడి తల్లీ, బిడ్డ ఇద్దరూ నలిగి చచ్చిపోయారట

### హరిజన ఉపాధ్యాయునిపై ఆగ్రహం

తమ ఎదుట తమతో సమానంగా కుర్చీలో కూర్చున్నందుకుగాను సహారా అనే వూరిలో వో ప్రయిమరీ స్కూలులో కొందరు ఉపాధ్యాయులు ఆ హరిజన ఉపాధ్యాయుడు దుల్లారామ్ అనేఆయన్ని గిల్లికజ్జాలకు దిగారట గొప్ప కులాలకు చెందిన వారు తమ సాటికి వస్తుండగా తాము లేవకపోవడం వారికి కోపం కలిగించిందని ఆయన అన్నారట.

### గోనెలో స్త్రీ శవం

తమిళనాడు కాంచీపురానికి చెందిన 28 ఏళ్ళ కమల్ అనే యువకుడు వో గోనెసంచిని [illegible] వెనకాల కట్టుకుని, ఆలంగుళం అనే వూరికి, పోతూండగా మధ్యేమార్గంలో వో అధికారి అతన్ని ఆపి ఆ గోనెలో ఏముందని అడిగాడట ప్రశ్నక్క

బదులు సరియైనరీతి రాకపోవడంవల్ల ఆమూట విప్పి చూస్తే లోపల స్త్రీ శవం వుందట. కప్పల్‌కు వివాహమై రెండేళ్ళయ్యిందట. అతను తన భార్య 22 ఏళ్ళ శివమ్మను చంపి, అరకంగా గోనెలో మూట కట్టి తీసుకుపోతున్నాడట. ఆ చర్యకి కారణం తెలియలేదు.

### ఉత్సవవిగ్రహాల దొంగతనం

ఆగ్రాజిల్లాలో కచరఘాట్ అనే వూరిలోని ఓ జైన దేవాలయం నుంచి 21 ఉత్సవవిగ్రహాలను ఎవరో దొంగిలించారు. ఇవన్నీ ఆరవ శతాబ్దం (క్రీ.శ) నాటివట. ఈ దొంగతనం డిసెంబరు 18 వ తేదీన జరిగిందట.

### తిండిపోతు మిల్లర్ !

తినడం పందాలలో ప్రపంచంలో గత పలబై ఒక్కళ్ళుగా జోజోమిల్లర్ అనే ఆయన గెలుస్తూ వస్తున్నాడట. ఈయన తనకిష్టమైనవి తానే పందుకు తింటాడట. ఒక పందెంలో యీయన రెండు పౌనుల బరువున్న ఇరవయ్యేడు కోళ్ళను చప్పరించేశాడట. ఒకసారాయన 20 గంటలసేపు ఏకధాటిగా తింటూనే వున్నాడట. 25 గిన్నెల పులుసు(సూప్)ను ఆయన జుర్రిపారేయగలడట

### లారీడ్రయివర్ల కత్తియుద్ధం !

పూనానుంచి బెంగుళూరు వస్తున్న అయిదు లారీలు నెలమంగల తనిఖీ ఆఫీసుముందు ఆపి, ఆ అయిదులారీల డ్రయివర్లూ కలిసి, హోటలుకు వెళ్ళి టిఫిను తిని, బయటికి వచ్చారుట. వీరంతా పంజాబీ వారట. డబ్బు విషయంలో ఏదో తేడా వచ్చి నీది తప్పంటే నీదేనని పోట్లాటారంభం చేసి, దాన్ని పట్రున పెంచేశారట. గురుబక్‌సింగ్, జ్వాలాసింగ్, కరన్‌సింగ్ అనే ముగ్గురూ కలిసి కాశ్మీయల్‌సింగ్ హుకుంసింగ్‌లమీద విరుచుకు పడ్డారట. కత్తులతో జరిగిన యీ పోట్లాటలో హుకుంసింగ్ పొట్టలో కత్తిపోట్లు తగిలి, అతను అక్కడే చనిపోయాడట.

### ఆత్రంతో యాత్ర

కోజికోడ్ రైల్వే స్టేషనులో కెన్ననూరు ఎక్స్‌ప్రెస్ రైలును అందుకోవాలని ఆత్రంగా పట్టాలకు అడ్డంగా పరిగెట్టిన సోయన్ అనే అతను ఓ గూడ్సు రైలు క్రిందపడి చనిపోయాడట. ఇది డిసెంబరు 18న తేదీన జరిగింది.

# ప్రస్తుత కర్తవ్యం?

సుప్రీమ్‌కోర్టు తీర్పుతో ముల్కీ వ్యతిరేక ఉద్యమంగా మొదలైన ఆందోళన ప్రధాని పంచసూత్రాల బలంతో ప్రత్యేకరాష్ట్ర ఉద్యమంగా రూపొందింది. ఆంధ్రప్రాంతంలో అన్నిరంగాలలోని పిన్నా పెద్దా దృఢసంకల్పంతో ఈ ఉద్యమంలో పాలుపంచుకుంటున్నారు. ఎలాంటి స్వార్థశక్తులూ ఈ ప్రజా ఉద్యమం వెనుక లేవని చెప్పడానికి యింతకన్నా వేరే నిదర్శనం ఏం కావాలి?

ఆంధ్ర ప్రజలంతా ఎలాంటి త్యాగాలకైనా సిద్ధపడి ప్రత్యేక రాష్ట్రాన్ని సాధించుకోవాలనే దృఢనిశ్చయంతో ఉన్నారు. ప్రజలు తీసుకున్న ఈ నిర్ణయాన్ని, దాన్ని సాధించడానికి వారు సాగిస్తున్న ఈ ఉద్యమాన్ని అణచడానికి ప్రభుత్వం అనుసరిస్తున్న దమనవిధానం, విచక్షణారహితంగా కొనసాగిస్తున్న కాల్పులు వారిని మరింత రెచ్చగొడుతున్నాయి. బలప్రయోగం ద్వారా ఎవరూ సమస్యని పరిష్కరించలేరు.

ఆంధ్రప్రాంతంలో పోలీసు కాల్పులకి గురై ప్రాణాలు పోగొట్టుకున్నవారి సంఖ్య 35 అని, గాయపడినవారు 230 మంది అనీ అధికారికంగా చెప్పారు. కానీ అసలు ఎంతమంది ఈ ఉద్యమంలో బలైపోయారో ఎవరికీ తెలీదు

ఇటీవల తిరుపతిలో జరిగిన మహాసభలకి ఆంధ్రప్రాంతానికి చెందిన శాసనసభ్యులు వందమందికి పైగా హాజరైనారు. వీరంతా ప్రత్యేకరాష్ట్రం కావాలనే ప్రజాభిప్రాయాన్ని ఒప్పుకున్నవారే. తెలంగాణాలోని శాసనసభ్యులలో కూడా ప్రత్యేకరాష్ట్రవాదులు సగానికి కాస్త అటూ యిటూగా ఉండవచ్చు. ప్రజాభిప్రాయాన్ని గౌరవించే యింతమంది శాసనసభ్యులు ఉండికూడా ఈ కల్లోలాన్ని ఆపడానికి తగిన ప్రయత్నం చేయకపోవడం విచారించతగిన విషయం.

సమైక్యతావాదులమనే ముసుగులో పదవులకోసం ప్రజల ప్రాణాలని బలి పెట్టే కొందరు స్వార్థపరులు అసలు విషయాన్ని మరుగుపరచి కేంద్రాన్ని పెడత్రోవ పట్టిస్తూ ఉంటే, వారి మాటలని, సలహాలని విని కేంద్రం తానుపట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నట్లు వ్యవహరిస్తూ ఉంటే ఇందరు ప్రజాప్రతినిధులూ ఉండి ప్రయోజనం ఏమిటి?

వేర్పాటునికోరే రెండు ప్రాంతాల శాసనసభ్యులూ మూకుమ్మడిగా రాజీనామా చేసి ఉండవచ్చు. లేదా అంతా కలిసికట్టుగా సరాసరి ఢిల్లీ వెళ్ళి ప్రధానమంత్రిని కలుసుకుని ప్రజాభిప్రాయాన్ని, తమ నిర్ణయాన్ని ఆమెకి గట్టిగా చెప్పవచ్చు. ఇంతమంది ఒకే విషయాన్ని గురించి గట్టిగా పట్టుబడుతున్నప్పుడు ప్రధాని అంగీకరించకుండా ఉండటం అన్నది జరుగుతుందా?

ఇంకా ప్రాణనష్టం, ఆస్తినష్టం జరగకముందే ప్రజాప్రతినిధులందరూ తమ తమ ప్రాంతాలలోని ప్రజల అభీష్టానికి అనుగుణంగా నిర్ణయాలని తీసుకుని ప్రజల ఆశయాన్ని పాలించాల్సిన అవసరం యిప్పుడు ఎంతైనా ఉంది.

—ఎం. ఎం. రావ్—

# వాణీజయరామ్‌తో ఇంటర్‌వ్యూ



వాణీజయరామ్ సినిమాతార కాదు. అలాగని ఆమెకు సినిమా ప్రపంచంతో సంబంధం లేదని కాదు. సినిమ పరిశ్రమకూ, ప్రేక్షకలోకానికీ ఆమె ఎంతో సన్నిహితురాలు. అందమయిన రూపం ద్వారా కాదు, తన అనుపమ కంఠం ద్వారా అసంఖ్యాకుల హృదయాల్లో ముద్రవేసుకున్నారామె. గొంతు అందించిన తొలి చిత్రంతోనే అగ్రశ్రేణి గాయనీమణుల కోవకు చేరుకున్న ఘనత ఒక్క వాణీజయరామ్‌కే దక్కింది.

హృషికేశ్ ముఖర్జీ దర్శకత్వంలో వచ్చిన 'గుడ్డి'లోని 'బోల్ రే పపీహరా' పాట ద్వారా పరిచితమయిన శ్రీమతి వాణీజయరామ్ ఇంతవరకు 80 చిత్రాల్లో పాడారు. ఇందులో హిందీతోపాటు, మరాఠీ, గుజరాతీ, మార్వారీ, హరియానా, కన్నడ, తమిళ భాషా చిత్రాలు కూడా ఉన్నాయి.

* \- *

కిందటి నెలాఖరున వాణీజయరామ్ మద్రాసు వచ్చారు. శ్రీ ఏ. యస్. ఆర్. ఆంజనేయులు హిందీకి అనువదిస్తున్న 'పాండవ బనవాస్' (పాండవ వనవాసం) చిత్రంలో పాడటంకోసం వచ్చారామె. అందులో ఆరుపాటలు పాడారు. ఆ తర్వాత నటుడు శ్రీ కృష్ణ తమిళంలో తయారు చేస్తున్న 'నల్లవనుక్కు నల్లవన్' (మంచి వాళ్లకు మంచివాడు)లో ఒకపాట, రాజన్—నాగేంద్రల సంగీత దర్శకత్వంలో కన్నడంలో ఒకపాట పాడారు, వాణీ జయరామ్.

'తెలుగు చిత్రాల్లో కూడా పాడాలని నాకెంతో మక్కువగా ఉంది!' అన్నారామె, నాతో ముచ్చటిస్తూ—స్వచ్ఛమయిన తెలుగులో. 1943 నవంబరు 30 న మద్రాసులో జన్మించిన వాణీ జయరామ్ పలు భాషల్ని ఆకళింపు చేసుకున్నారు. ఆమె తమిళుల కుటుంబంలో జన్మించినా, తల్లి వారిది కర్నూలు కావటంవల్ల తెలుగు చక్కగా పట్టుబడింది వాణీ జయరామ్‌కు. ఐదుగురు సోదరీమణులు, ముగ్గురు సోదరులు. ఆమెతోపాటు ఆమె సోదరీమణులు అయిదుగురూ సంగీతంలో నిష్ణాతులే! ఆమె పెద్దక్క విమల గానకళానిధి. 1953 లో జరిగిన సంగీతపు పోటీలలో అన్ని బహుమతులు శ్రీమతి విమలకే లభించాయి.

స్థానిక క్వీన్ మేరీస్ కాలేజ్‌లో బి. ఏ. (ఎకనమిక్స్) పూర్తిచేసిన వాణీ జయరామ్—ఆ తర్వాత మద్రాసులోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగం చేశారు. హైదరాబాద్ బ్రాంచిలో కూడా కొంత కాలం పనిచేశారు. బాల్యంనుంచీ ఆమెతో సంగీతం ఉంది. ఆ సంగీత సాధన చేస్తూ కచేరీలు ఇస్తూ 1968 లో శ్రీ జయరామ్‌ను వివాహం చేసుకున్నారు. బొంబాయి మాస్టర్ ప్రింటర్స్ అసోసియేషన్‌లో ఆయన ఎగ్జిక్యూటివ్ సెక్రటరీ. శ్రీ జయరామ్‌తో వివాహం వాణిని బొంబాయికి తీసుకువెళ్లింది. అక్కడ—పాటియాలా ఘరానాకు చెందిన ఉస్తాద్ అలీ ఖాన్ దగ్గర హిందుస్తానీ లైట్ క్లాసికల్ నేర్చుకున్నారు.

'మావారు మంచి మ్యుజిషియన్. సితారు చక్కగా వాయిస్తారు. పండిట్ రవిశంకర్ దగ్గర ఆరేళ్లు శిష్యరికం చేశారాయన' అన్నారు, వాణీజయరామ్.

వాణిలోని సంగీత తపన కొద్ది నెలల్లోనే ఆమెను క్లాసికల్ సింగర్‌గా తయారుచేసింది. ఆ తర్వాత బొంబాయిలో స్టేజిమీద ప్రోగ్రాములు ఇస్తూ, హిందుస్థానీ సంగీత సమ్మేళనాల్లో పాల్గొంటూండేవారు. ఈ సమ్మేళనాల్లో ఒకరోజు సంగీత దర్శకుడు వసంతదేశాయి ఆమె గొంతు విన్నారు. దాని పర్యవసానమే 'గుడ్డి'లో ఆమె పాడటానికి కారణం.

'మొదట అందులోని మూడు పాటలు రికార్డ్ చేశారు. రెండుమాత్రం ఉంచి, మూడోపాట తీసేశారు. నేనిప్పుడు బొంబాయిలో అందరు సంగీత దర్శకుల వద్దా పాడుతున్నాను. నేను ఠుమ్రి, ఘజల్స్, భజన్స్ స్పెషలైజ్ చేశాను.' అని కూడా చెప్పారామె.

1971 లో శాస్త్రీయ సంగీతంలో ఉత్తమ హిందీ నేపథ్యగాయనిగా మియాన్ తాన్‌సేన్ అవార్డు పొందారు వాణీ జయరామ్. అంతేకాదు, ఉత్తమ నేపథ్య గాయనిగా అఖిలభారత చలనచిత్ర ప్రేక్షక సంఘంవారి అవార్డుకూడా లభించిందామెకు. బహుమతులు పొందటం ఆమెకు కొత్తకాదు. యస్. సి. సి. డ్రామాల్లోను, డిబేట్స్‌లోను ఒకసారి మొత్తం 17 బహుమతులూ ఆమెకే లభించాయి.

సంగీతంలో ఎంతో ప్రతిభకలిగిన వాణీ జయరామ్‌లో అంతకుమించిన అణకువ, నిరాడంబరత కనిపిస్తాయి. ఆమెతో మాట్లాడుతున్నప్పుడు, మనకు చిరకాలంగా పరిచయం ఉన్న స్నేహితురాలితో మాట్లాడుతున్నట్టు ఎంతో హాయిగా ఉంటుంది. తెలుగుచిత్రాల్లో పాడాలనుకుంటున్న ఆమె అభిలాషను గుర్తించి, పాడించటంలో ఔచిత్యం ఉంటుంది.

—మోహన్ పమార్

# రామ రాజ్యమా? కాదు-రాక్షస రాజ్యము!

ఏమిటీ అల్లకల్లోలం? ఏమిటీ కోలాహలం? అని పల్వురు విమర్శించే విధంగా వుంది ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిపాలన, ప్రజల పరిస్థితి. అంది ప్రముఖ నటి ఒకావిడ.

ఇంత వరకు మనది రామరాజ్యమే అని వూహిస్తుండిన మనకు, కాదు — రాక్షస రాజ్యం అని తేటతెల్లమైంది, ఇప్పుడు జరుగుతున్న రైఫిళ్ళ కాల్పులు, ప్రజల సజీవ సమాధులను చూస్తుంటే. అన్నారు ప్రముఖ హీరో ఒకరు.

షుమారు రెండు నెలలుగా నిర్విరామంగా కొనసాగుతున్న సమ్మెలను, సమ్మెదార్ల నమ్మకాలను నమ్ముచేయడం చేతనైంది మన ముఖ్యమంత్రికి. కాని దీనికి పరిష్కార మార్గాన్ని ఆలోచించి, నిష్కారణంగా బలి అయిపోతున్న వార్ని కాపాడలేక పోవడం నిజంగా శోచనీయం. అంది తలనెరసిన ఒక్క మహానటి

గోరంతను కొండంత చేసి, ఏ చిన్న విషయాన్ని తర్కించాలన్నా ఢిల్లీ తరలి వెళ్ళడం, అక్కడి ప్రభుత్వానికి తల వగ్గడం లాంటి మన ముఖ్యమంత్రి కార్యాలు, అర్యులకు అసమంజసంగా, అ స ం గ త ం గా వున్నాయి అంటారు రాజకీయంలోని మర్మాల నెరింగిన నటుడొకరు.

ప్రజలు డిమాండు చేస్తున్న 'ఆంధ్రా విభజన' అనే సమస్యను సరిగా పరిశీలించి, పరిశోధించి, పరీక్షించకపోవడం, అకారణంగా నాశనమవుతున్న ప్రజల సొత్తును, మున్నెన్నడు కని, విని, ఎరుగని విధంగా సమ్మెలు, సత్యాగ్రహాలు జరుగుతున్నా చూస్తూ వూరుకోవడం దేశానికి పట్టిన విషాదకాలం అని స్పష్టమవుతుంది' అన్నారు అనుభవజ్ఞులైన కొందరు సినీప్రముఖులు

సమయం, సందర్భం దొరికిందకదా అని స్వార్థపరులు, సంఘవిద్రోహులు కొందరు అమాయకులను ఆటబొమ్మలుగా వుపయోగించుకొని, అనర్థాలను, అమానుష కృత్యాలను ఒనరిస్తున్నా, చేతులు కట్టుకొని కూర్చుంటున్న ప్రధాన వ్యక్తులను, పరిపాలనాధికారులను చూస్తుంటే రక్తం వుడికిపోతుంది అంటున్నారు మరికొందరు సినీ వక్తలు.

ఐకమత్యానికి బదులు రక్తపాతం; న్యాయం, ధర్మాలకు బదులు అన్యాయం, అధర్మం; శాంతికి బదులు అశాంతి; తాండవం చేస్తున్న ఆంధ్రప్రదేశ్‌ను విచారించి, ఆమోదయోగ్యమైన నిర్ణయాన్ని తీసికొని, అసలు జరుపలేనంత అధ్వాన్నంగా వుంది రాష్ట్రపరిపాలన అంటారు ఇంకెందరో.

'నాయకులు నడుంకట్టి నడిపిస్తున్న వుద్యమం కాదిది. ప్రజలే పాలుపంచుకొని, మాకు మేలు జరగాలి అని నినాదాలతో ముందడుగువేస్తున్న వుద్యమం ఇది. 1942 వుద్యమంగూడ ఇంత వుధృతంగా లేదు' అన్నారు ప్రముఖ డిస్ట్రిబ్యూటరొకరు.

[ ఈ అభిప్రాయాలని వెలిబుచ్చిన వారందరూ తమ పేర్లని బయటపెట్ట వద్దని కోరారు ]

—శ్రీనివాస్

## కనపడుట లేదు!

నాయనా! నువు వెళ్ళినప్పట్నించీ అమ్మ మంచ మెక్కింది  
ఎన్ని ప్రణాళికల మందులు పోసినా, యేమి గుణం లేదు  
అమ్మ నీకోసం, యేడ్వని క్షణం లేదు.  
ఇంట్లో యెక్కడ చూసినా, యెలుకలు, కొక్కులు, పాములు, స్వాములు, పళ్ళు కొరికే భూస్వాములు,

ఆస్తికోసం పొంచుకున్న అప్పుల వాళ్ళ,  
ఆలంలోనో, కాకపోతే వేలంలోనో, యిల్లు కాజేయాలనే యిరుగూ, పొరుగూ,  
ఆకలేసి నప్పుడు అన్నముండదు, యిల్లంటుకున్నప్పుడు నీళ్ళుండవు.  
ఇదీ పరిస్థితి—ప్రస్తుతం యింటికి పట్టిన దుస్థితి.  
నువ్వు లేకుండా, యిక్కడే పనీ సజావుగా సాగదు.  
ఏ దేశంలో వున్నా, వెంటనే యింటికి రా!  
నలుగుర్లో నీ యింటని నవ్వుల పాలు కానీకు!  
అమ్మ పెద్దతనానికి—అవమానం కానీకు!

*   *   ●

అయ్యలారా! అమ్మలారా! మా అబ్బాయి కనుబడుట లేదు,  
ప్రాణ భయంతో యింటినుంచి పారి పోయాడు.  
నిక్క పలుచని వాడు, బ్రతికి చెడిన వాడు,  
ముఖం మీద కాలి (ల్చి)న మచ్చలున్నవాడు,  
గుండెల మీద దెబ్బల గుర్తులున్నవాడు,  
అదీ అతని రీతి, అతని పేరు నీతి  
పట్టి యిచ్చిన వారికి, బహుమతి—ప్రగతి!  
ఆచూకీ తెలిపేవారు, అడ్రసు గమనించ ప్రార్థన.  
శోకాల సామాన్యరావు, సోషలిజం నగర్!  
యెన్నికల పే(వే)ట! ఇంటి నెంబరు యిరవై ఐదు. ఇండియా!

—'తులసీ కృష్ణ'




**పి. బి. ఎస్, నిడదవోలు**

అందమైన ఆడదాన్ని చూసి అబ్బాయిలు ఏమనుకుంటారో మీకు తెలుసా?

తెలియకేం?

అందమైనది— అంచేత ఆరాధిద్దాం.

ఆడది— అంచేత గెలుచుకుందాం' అని.

**సంగం, నిజామాబాద్**

బరి తెగించిన స్త్రీకి మీకు అర్థం తెలియదేమో. ఉదాహరణకు మిమ్మలను తీసుకోవచ్చు.

థాంక్యూ. 'బరితెగించడం' అంటే నేనే అయితే దేశంలో యింకా చాలా మంది బరితెగించాలని కోరుకుంటాను.

**పి. ఎస్. ఎమ్, గుంటకల్**

జీవితం, వేదాంతం—ఈ రెండింటిలో ఏది ముందు?

జీవితం. ఎందుకంటే— దానిలోనే వుంది అంత ర్వాహినిగా— వేదాంతం.

**ఎమ్. ఎమ్. ఆర్, బద్వేలు**

ప్రేమ అనేది సౌందర్యంతో ఎందుకంత ఘనిష్ఠంగా పెనవేసుకుని వుంటుంది?

అలా అని ఎవరన్నారు? ప్రేమ— లేని సౌందర్యాన్ని ఆపాదిస్తుంటే? .. తా వలచినది రంభగా తోసింప చేసేది ప్రేమ.

**ఎ. ఎమ్. కె, మునగపాక**

అందని ఆశలకై కలలు కంటే వాటిని మనం పొందకల్గుతామా?

చూడు బ్రదర్, ఆశతో ఎదురు చూడకపోతే నిరాశకు స్థానం లేదు. ఇక, ఆశలు ఏమిటి? మెలుకువగా వున్నవాడి కలలే కదా!

**బి. బి. జి, దోర్నకల్**

కె. రా గారూ ముల్కీ నిబంధనలపై మీ అభిప్రాయం?

అనాగరికం— అని

**టి. వి, చీర్వెలి**

సాహిత్య సేవలో స్త్రీలు పురుషులను మించిపోవుటవలన సాహిత్యానికి నష్టం కల్గుతోంది అనుటలో శ్రీ పెద్దాడశాస్త్రి గారితో ఎంతవరకు ఏకీభవించగలరు?

ఎవరి పెద్దాడ శాస్త్రిగారు? ఏ ఆధారంతో చేస్తున్నారీ నిందారోపణ?! ఈనాటి సాహిత్యంలోనే కాదు పెద్దలు యీ నాటికీ పూజించే ప్రాచీన సాహితీరంగాన కూడా స్త్రీల సాహిత్యం వల్ల— సాహిత్యం విజృంభించిందేగాని— కుంటుపడిపోలేదు. ఆనాటి గారి నుండి యీనాటి రంగనాయకమ్మదాకా వోసారి పర్యావలోకనం చేయమనండి.

**టి. వి, చీర్వెలి**

సెలవుదినం అని పాటించకుండా సరిగ్గా ఆగస్టు పదిహేనున మిమ్మల్ని కాలేజీలో చేర్చుకోవడం—ఎంతవరకు నమ్మవచ్చు?

పూర్తిగా నమ్మ విజయా, ఆగస్టు 15 — 1947 నాడే స్టెల్లామేరిస్ కాలేజీ ప్రారంభం అయింది. నేనా కాలేజీ తొలి గ్రాడ్యుయేట్ల సెట్టులో దాన్నే! ఇలాంటి చిన్న నిజాలకి అబద్ధం చెప్పడం ఎందుకు?

**పి. ఎస్. డి, అత్తిలి**

మా శ్రీవారికి ఎంత స్వేచ్ఛనిచ్చినా ప్రతీ ఒక్కవిషయం నిజం చెప్పక అబద్ధమే చెపుతారు. దీనికి కారణం ఏమిటి?

లాక్ ఆఫ్ సెక్యూరిటీ! చిన్నపిల్లల్లో లాగే పెద్దవాళ్లల్లో కూడా ఏమో నిజంచెప్తే నమ్మకపోతే' అన్న అనుమానంతో అబద్ధం చెప్పేలా చేస్తుంది. గట్టిగా నిలదీసి అలా అబద్ధం ఎందుకు చెప్పారని గదమాయిస్తే పిల్లలు ఏడుస్తారు. పెద్దలు, వో వెకిలినవ్వు ఏదో నవ్వి, నిన్ను పరీక్షిద్దామనీ' అంటూ సర్దుకోవాలని చూస్తారు. ఇందులో యిప్పుడు మీ తప్పేంలేదు. పెంచి పెద్ద చేసిన వారి తల్లిగారి తప్పు.

**ఆర్. ఎల్, విశాఖపట్నం**

స్నేహంలోవున్న తియ్యదనం బంధుత్వంగా మారినప్పుడు వుండదు. కారణం?

చుట్టాలయి పోవడమే. చుట్టాలకి — చుట్టాల మీద దాన విక్రయాది హక్కులన్నీ వున్నాయనుకుంటారు. స్నేహితులలా కాదు — వ్యక్తిత్వానికి గౌరవం లేకపోతే — స్నేహం నిలవదని జాగ్రత్తగా వుంటారు.

**ఎమ్. ఏ. ఆర్, మార్కాపురం**

ఏమండీ, ప్రశ్నవేయడం గొప్పా? జవాబు చెప్పడం గొప్పా?

అడిగేవారికి చెప్పేవారు లోకువని యీ మధ్యనే మహీధరరామమోహనరావు గారు — నాలేఖకి సమాధానం చెప్పారు! అంచేత ప్రశ్నించడమే గొప్ప అనుకుందాం — సోదరీ.

**పి. ఎమ్. కె, వీరవాసం**

కులమత భేదాలు వుండకూడదంటూ అప్లికేషను ఫారాల్లో నీ కులం? నీ మతం? అంటూ అడుగుతా రెందుకు?

సరదాకి! లెక్కలకి! కుతూహలం — అంటారు. చెప్పకపోతే — అప్లికేషను బుట్టదాఖలు. ఈ మధ్య నా కూతురు యీ సంగతులు రాయకపోతే యింటి ర్వ్యూలో ఫార్వార్డ్? బేక్వార్డ్? అని అడిగిందట. తెలియదంటే అయితే 'ఎఫ్' అని మార్కుచేసి పడేసిందట అప్లికేషన్!

**పి. ఎమ్. ఆర్. బి.; పి. ఎమ్. ఎస్. వీరవాసం.**

చదువుకి సంస్కారానికి కల సంబంధం ఏమిటి ?

సంస్కారం ఎంతో కొంత పుట్టుకతోనే వస్తుంది. దాన్ని చదువు పెంపొందింప చేస్తుంది. చదువుకున్న వాళ్లంతా సంస్కారవంతులని అనుకోనక్కరలేదు. చదువులేనంత మాత్రాన సంస్కార హీనులనీ అనుకోనక్కరలేదు.

**వై. ఎస్, నందికొట్కూరు**

నేను ఒకకథ రాసిపంపేను. కథ పేరు కమల పద్మాల సంభాషణలు అని. యింత వరకు ప్రచురించలేదు...

అయ్యోపాపమ్మడూ — పోస్టులో వాళ్లిద్దరూ మాట్లాడుకుంటూ వుండిపోయారేమో — ఆడవాళ్ళు కదూ!

**ఇ. వి. పి. ఆర్, బెంగుళూరు**

నీకు పనిపాట లేదని విన్నాను. నాకో పని చేసిపెడుదూ. నేను రాసిన కొన్ని కథలు రైటు కాపీలు చేయాలి. అందుకు అంగీకారమేనా ?

పది పేజీలుమించని కథ రైటుకాపీ చేయడానికి ఏభయి రూపాయలు. నీ తరఫున కామాలు, ఫుల్ స్టాపులూ, పేరాలూ వేయడానికో పాతిక. పరిసీ కథకు డెబ్బయి అయిదురూపాయలు. రైటుకాపీ నీకే పంపేస్తాను. ప్రచురణ గ్యారంటీ లేదునుమా. ఇందుకు — అంగీకారమేనా?

**కె. ఎమ్. వి, పాత గుంతకల్లు**

మీరు ఎలాంటి ప్రశ్నకైనా చమత్కారంగా జవాబిస్తారు. మీరు ఏ బియ్యం వాడుతారు ?

మా కరుణానిధి గారు రేషన్ షాపుల్లో ఏవి సప్లయి చేస్తే అవే — ఆ వారానికి!

# ముత్యాల వంటి పళ్లతో వజ్రపుతునక వంటి ఒంటితో, బాలకృష్ణుని లాగా ముద్దులొలుకుతూ ఉంటాడు నా బంగారు తండ్రి!

**కాల్షియం శాండోజ్ నేను తీసుకుంటున్న దందుకేగా!**

గర్భస్థ శిశువుకు ఎముకలు, పళ్ల ఏర్పడేది ఆఖరి మూడు నెలలలోనే. బిడ్డకు కావలసిన కాల్షియమును మాతృదేహమే సమకూర్చాలి.

అందువల్ల, గర్భిణీ స్త్రీలకు ఈ కాలంలో కాల్షియం అధికంగా కావాలి.

తల్లి కాల్షియం శాండోజ్ సేవిస్తే, బిడ్డకు దృఢమైన ఆరోగ్యవంతమైన పళ్లు ఎముకలు ఏర్పడతాయి. తల్లికి కాళ్ల తిమ్మిరు ఉండవు.

కమ్మని రాస్ప్‌బెరీ రుచి గలిగి, చప్పరించుటకనువైన బిళ్లల రూపంలో, పరిశుద్ధమైన కాల్షియమును లభింప చేస్తుంది కాల్షియం శాండోజ్. రోజుకు 4-6 బిళ్లలు ఇస్తే చాలు. ఎముకలు, పళ్లు, దృఢంగా పెరగటమేకాక విటమిన్లు సి, డి; B12 ప్రయోజనం కూడా లభిస్తుంది.

కాల్షియం ఉత్పత్తులలో యావత్ప్రపంచములో సిద్ధహస్తులైన శాండోజ్ వారిచే అది తయారు చేయబడింది.

రోజూ కాల్షియం శాండోజ్ సేవించండి. మీ కలలు వాస్తవమౌతాయి!

## కాల్షియం-శాండోజ్®




ఆబాలగోపాలమునకు అనుదిన సేవన యోగ్యం!








dCP/CS/5d tel




### జరిగిన కథ

రామ్మూర్తికి ఇద్దరు కొడుకులూ, ఒక కుమార్తె. పెద్దవాడు ప్రసాద్ ఉద్యోగం చేస్తున్నాడు. రెండవ వాడు కొంచెం అల్లరిచిల్లరగా తిరుగుతుంటాడు. కుమార్తె లక్ష్మి పెళ్ళికి ఎదిగి వుంది. భార్య శాంతమ్మ రోగిష్టిది. కాంచన ప్రసాద్ ఆఫీసులోనే పని చేస్తున్నది. ప్రసాద్ కాంచనా ప్రేమలో పడ్డారు. అందుచేత తండ్రి తెచ్చిన సంబంధానికి ప్రసాద్ ఇష్టపడలేదు. ప్రసాద్, కాంచనలు మరింత దగ్గరయ్యారు. పెళ్ళి చేసుకున్నారు. ప్రసాద్‌కి పిల్లనివ్వాలను కున్న సత్యనారాయణకిది చాలా బాధ కలిగించి రామ్మూర్తిని అపార్థం చేసుకున్నాడు. ఆలస్యంగా వచ్చాడన్న సాకుతో అతని ఉద్యోగంలోనుంచి తీసేశాడు. లక్ష్మికి సంబంధాలు చూస్తున్నారు. పెద్ద కొడుకు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. కుమార్తె పెళ్ళికి ఇల్లు తనఖాపెట్టి, ఆ డబ్బును కొడుకు చేతికిచ్చాడు రామ్మూర్తి. ప్రసాద్ ఆ డబ్బును స్వంతం చేసుకున్నాడు. పైగా ఆస్తిలోనూ, ఇంటిలోనూ వాటా అడిగాడు. భార్యకి రజనీకుమార్ కథ చెప్పాడు రామ్మూర్తి. శాంతమ్మ గారికి బాగా జబ్బు చేసింది. లక్ష్మి కంగారు పడింది. చిట్‌ఫండ్‌కి సంబంధించిన డబ్బును రాజా తీసుకుపోయాడు. రజనీకుమార్ రామ్మూర్తిని రక్షించాడు. కాశీ విశ్వనాథంగారి యింటి దగ్గర రజనీకుమార్ కుమారస్వామి అయ్యాడు.

## 17

రజనీకుమారును చూడగానే తాతయ్య 'లే, బాబూ! లే! భోజనం చేద్దువు గాని, చాలా ఆలస్యం అయింది' అన్నాడు.

'భోజనమా? యెక్కడిది?' అని రజనీకుమార్ ప్రశ్నించాడు ఆశ్చర్యపోతూ.

'నేనే చేశాను బాబూ! పచ్చడీ, చారూ చేశాను మజ్జిగ తెచ్చాను అంతకంటే యేం చెయ్యలేకపోయాను'

తాతయ్య ఆదరానికి రజనీకుమార్ మాట్లాడలేకపోయాడు.

తాను చేసినవి నచ్చకపోవడంవలన కుమార్ మాట్లాడడం లేదేమోనని తాతయ్య అనుకొన్నాడు.

'బాబూ! ఈ పూటకు యెలాగో భోజనం చెయ్. రాత్రికి యింకేదైనా చేస్తానులే' అన్నాడు తాతయ్య బ్రతిమాలుతున్నట్లుగా.

'తాతయ్యా! నువ్వు యింత నీరసంగా ఉండీ, నాకోసం వంటచేశావా? యెంత కష్టపడ్డావు తాతయ్యా?' అని రజనీకుమార్ నొచ్చుకున్నాడు.

'ఇందులో కష్టానికేముంది బాబూ? ముందు భోజనం చెయ్. నిన్న యెప్పుడు భోజనం చేశావో.'

'అంత నీరసంగా ఉండికూడా తన నిమిత్తం వంటచేసిన తాతయ్యతో, తను హోటల్లో భోజనం చేసిన సంగతి చెపితే, అతను యెంత బాధపడతాడో' అనే సందేహంతో రజనీకుమార్ యేమీ మాట్లాడలేదు.

'లే బాబూ! లే! ముందు భోజనం చెయ్' అంటూ రజనీకుమారును తొందర చేశాడు తాతయ్య.

'ఇక అబద్ధం చెప్పక తప్ప'దని నిర్ణయించుకున్న రజనీకుమార్ 'తాతయ్యా! నేను బోసుగారివద్దకు వెళ్ళి వస్తూ ఉంటే, అక్కడ ఒక స్నేహితుడు కన్పించి, భోజనానికి పిల్చాడు. 'నేను మా తాతయ్యవద్ద భోజనం చెయ్యాలి. ఇప్పుడు రాను' అని నేను చెప్పాను అయినా ఆ స్నేహితుడు బలవంతం చెయ్యడంవలన అతనితో కలిసి హోటల్లో భోజనం చేశాను. రాత్రికి నేను యెక్కడకూ వెళ్ళను. ఇక్కడే భోజనం చేస్తాను' అన్నాడు.

తనను అంత అభిమానంతో చూస్తున్న తాతయ్యతో అబద్ధం చెప్పవలసివచ్చినందుకు రజనీకుమార్ చాలా బాధపడ్డాడు.

'పోనీలే, బాబూ! యెక్కడో ఒకచోట వేళకు భోజనం చేశావు. స్నేహితులు భోజనానికి పిలిచినప్పుడు వెళ్ళకపోతే బాగుంటుందా? అయినా, యీ పచ్చడీ, మెతుకులు యెలాగ తినగలవని నేనూ మనస్సులో అనుకొన్నాను' అన్నాడు తాతయ్య

'కాదు, తాతయ్యా! పచ్చడీ, మెతుకులే కాదు. నీ చేత్తో యేం పెట్టినా, అది నాకు అమృతమే. రాత్రికి నేను యిక్కడే భోజనం చేస్తానుగా' అన్నాడు రజనీకుమార్, అమృతంవంటి సాంబయ్య మనస్సును తలచుకొంటూ.

'అది సరేకాని బాబూ! ఈ ఆరు మాసాలూ నువ్వు యెక్కడ ఉందామను కొంటున్నావు?'

'ఏదో. గది చూసుకోవాలి.'

'బాబా! యిలాంటి గదులు దొరకడమే కష్టం. దొరికినా, నాటిక చాలా అద్దె ఉంటుంది'

'అవును తాతయ్యా! నాలాగ బోసుగారి దగ్గర ట్రైనింగు పొందడానికి వచ్చిన వాళ్ళందరూ అదేమాట అన్నారు'

'అయితే, బాబా! నువ్వు యేమీ అనుకోనంటే నేను ఒకమాట చెపుతాను'

'ఏ మాటకు నేను అనుకోవడమా? నువ్వు యింకా చెప్పాలనుకొన్నావో, దాన్ని సందేహం లేకుండా చెప్పు!'

'విశ్వనాథంగారు యెలాగా నిన్ను యిక్కడ ఉండమన్నాడు కదా! ఈ ఊరు వదిలిపోయేవరకు నువ్వు యిక్కడే ఉంటే సరిపోతుంది. నువ్వు వేరే గది వెతుక్కోవలసిన అవసరం లేదు నాకు కూడా తోడుగా ఉంటావు' అన్నాడు తాతయ్య

'నిజంగా నేను నీ మనవణ్ణని అనుకో, విశ్వనాథంగారు నన్ను యిక్కడే ఉండి, తోటపని చెయ్యమని చెప్పారు. ఆ మాటప్రకారం నేను యిక్కడ ఉండకపోతే, అది వారిని మోసం చెయ్యడం కాదా, తాతయ్యా?'

'ఇందులో మోసానికి యేముంది బాబూ? మోసంచేసి మనం యెవరి డబ్బూ అపహరించడం లేదు. నిజంగా నువ్వు నా మనమడివైతే యిక్కడ ఉండవా? విశ్వనాథంబాబుకు తరువాత నిజం తెలిసినా, యింక యేమీ అనుకోడు ఆయన చాలా సరదా అయిన మనిషి తెలివిగా యెవరు యే పనిచేసినా ఆయన సంతోషిస్తారు తోటపనికూడా నువ్వేం చెయ్యనక్కరలేదు. పనంతా నేనే చేస్తాను' అన్నాడు తాతయ్య రజనీకుమారుకు నచ్చచెబుతూ

'పనికేముందిలే తాతయ్యా? అక్కడ మాత్రం నేను తాతయ్యతో కలిసి తోటపని చేసేవాణ్ణి కాదా? తోటపని చెయ్యడం నాకు సరదాయే కాని 'శ్రమ'అని ఎప్పుడూ నేను అనుకోలేదు' అన్నాడు రజనీకుమార్.

కాశీవిశ్వనాథంగారు పొరబడి, తన్ను అక్కడ ఉండిపొమ్మనడంవలన తాను అక్కడే ఉండడం రజనీకుమారుకు ఇష్టం లేదు. కాని తాతయ్య మాటను తోసిపుచ్చడానికూడా అతని మనస్సు అంగీకరించలేదు రజనీకుమార్ సందిగ్ధావస్థలో పడ్డాడు.

'అయితే నా మనమణ్ణని చెప్పుకోవడానికి సందేహిస్తున్నావా, బాబూ?' అని ప్రశ్నించాడు తాతయ్య

'ఎంతో పుణ్యం చేసుకొన్నవాళ్ళకుగాని నీవంటి అభిమానం కలిగిన తాత దొరకడు తాతయ్యా!' అన్నాడు రజనీకుమార్ వెంటనే.

'పోనీ, కొన్నాళ్ళపాటు ఇక్కడ ఉండి చూడు బాబూ! అప్పుడు నీకు యేదైనా యిబ్బంది కలిగితే, యింకో చోటుకు వెళ్ళిపొమ్మను' అని మధ్యమార్గాన్ని సూచించాడు తాతయ్య

'సరే, అలాగే చేస్తాను' అన్నాడు రజనీకుమార్

తాతయ్యవద్దనే ఉండిపోయాడు రజనీకుమార్. వెంటనే అతను ఈ విషయాన్ని రామ్మూర్తికి ఉత్తరం రాశాడు.



మర్నాడు ఉదయం పదిగంటలకు రజనీకుమార్ బోసువద్దకు వెళ్ళాడు.

ఆధునిక చిత్రకళయొక్క ప్రత్యేకత గురించి బోసు కొంతసేపు విద్యార్థులకు వివరించాడు.

బోసు తరువాత తాను కొన్ని బొమ్మలు గీసి, విద్యార్థులచేత మరికొన్ని బొమ్మలను గీయించి, అందులోని మెలకువలను వారికి బోధించాడు

ఇంటివద్ద కొన్ని బొమ్మలు గీసి వాటిని మర్నాడు తనకు చూపించవలసినదిగా అతను విద్యార్థులకు చెప్పాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలు కాగానే బోసు విద్యార్థులను వదిలిపెశాడు.

రజనీకుమార్ అక్కడనుంచి తిన్నగా తాతయ్యవద్దకు వచ్చాడు భోజనం చేసిన తరువాత అతను బోసు చెప్పిన బొమ్మలు గీయడం ప్రారంభించాడు ఆ బొమ్మలు పూర్తిచేయడానికి అతనికి రమారమి రెండు గంటలసేపు మాత్రం పట్టింది మిగిలిన సమయంలో అతను తోటపని చేశాడు

అతని రోజువారీ కార్యక్రమం కొంచెం యించుమించుగా యిలాగే ఉండేది.

వారం రోజులపాటు అతను తోటపని చేసేసరికి, తోట చాలా శుభ్రంగా, అందంగా తయారయింది.

'కుమారస్వామి వచ్చిన దగ్గరనుంచీ తోట చాలా బాగున్నదని కాశీ విశ్వనాథం,

# అనగనగా...

అతని భార్య అన్నపూర్ణమ్మ, కుమార్తె సరళకూడా అనుకొన్నారు.

'నీ మనమడు తోటపని చాలా శ్రద్ధగా చేస్తున్నాడు' అని కాశీ విశ్వనాథం ఒకటి రెండుసార్లు తాతయ్యతోకూడా అన్నాడు.

ఆ మాటకు తాతయ్య చాలా సంతోషించాడు.

రజనీకుమార్ తన తీరిక సమయాన్ని తోటపనికే వినియోగించేవాడు తాతయ్య నిమిత్తం సాంబయ్య యిచ్చిన పంచెల చాపుకు తగా రజనీకుమార్ రెండు చొక్కాగుడ్డలు కూడా కొనియిచ్చాడు. అప్పుడప్పుడు అతను తాతయ్యకోసం తినుబండారాలను కూడా తెస్తుండేవాడు

ఒకనాటి సాయంత్రం రజనీకుమార్ మామూలుగా మొక్కలకు నీళ్లు పోస్తుండగా అతనికి యేవో మాటలు వినిపించాయి. అతను తలయెత్తి చూసేసరికి నలుగురు అమ్మాయిలు కన్పించారు. వాళ్ళు యేవో కబుర్లు చెప్పుకొంటూ నవ్వుకొంటున్నారు. రజనీకుమార్ తలదించుకొని తనపని తను చేసుకొంటున్నాడు. వాళ్ళ మాటలు అతనికి స్పష్టంగా వినిపిస్తున్నాయి.

'ఏమే, సరళా? యెవరా తోటరాముడు?' అని ప్రశ్నించింది ఒక కంఠం

'అజ్ఞాతవాసంలో ఉన్న రాజకుమారుడేమో' అన్నది యింకో కంఠం.

'లేక ఏ గూఢరహస్యాన్ని ఛేదించడానికి వచ్చిన గూఢచారేమో' అన్నది మరొక కంఠం.

'ఏదీ కాదే, మా తోటమాలి తాతయ్య మనమడు స్వామి. ఈ మధ్యనే యిక్కడకు వచ్చాడు' అన్నది నాల్గవ కంఠం.

'అంటే మీ స్వామన్నమాట' అన్నది మొదటి కంఠం.

'అవును మా స్వామే'

'మీ స్వామా? నీ స్వామా?'

'మాశావా? నువతో చెప్పకుండానే సరళ తన స్వామిని యెంచేసుకుంది'

'పోవే, నీకు యెప్పుడూ అదే గొడవ' అన్నది సరళ.

'ఏం? నువ్వు చెప్పినదాన్నే మేం అంటే తప్పా?' అని ప్రశ్నించింది ఒక కంఠం.

'నీ చెవులు నేను మెలిపేస్తే మాత్రం తప్పా?' అంటూ సరళ ఆమె చెవి పట్టుకొంది

'వదలవే, నీకు దణ్ణం పెడతాను చెవి నొప్పి పెడుతున్నది—నీ స్వామి జోలికి మేం రాములే' అన్నది యింకో కంఠం

ఆ మాటకు అందరూ గొల్లుమని నవ్వారు

వాళ్ళ కొంటెమాటలకు రజనీకుమార్ కూడా తనలో తాను నవ్వుకొన్నాడు.

* * *

రజనీకుమార్ తనపని తాను శ్రద్ధగా చేయడంవలన అతని యెడల బోసుకు అభిమానం కలిగింది రజనీకుమార్ గీసిన ఒక బొమ్మను ఇంటర్నేషనల్ ఆర్ట్సు సొసైటీ వారు నిర్వహిస్తున్న పోటీకి పంపించాడు బోసు.

ఒక ఆదివారం మధ్యాహ్నం రజనీకుమార్ తాతయ్య యింట్లో కూర్చుని యేదో చదువుకొంటున్నాడు. అకస్మికంగా అతనికి అమ్మాయిల మాటలు, నవ్వులు వినిపించాయి.

'ఆ వేళ సెలవుకదా! ఆ అమ్మాయిలు తోటలో చదువుకోడానికి వచ్చారేమో' అనుకొన్నాడు రజనీకుమార్

తాతయ్యయింటికి దగ్గరగాఉన్న చెట్లుకింద సిమెంటు బెంచీలు ఉన్నాయి. అమ్మాయిలు ఆ బెంచీలమీద కూర్చోనడం వలన వాళ్ళమాటలు రజనీకుమారుకు స్పష్టంగా



వినిపిస్తాయి.

కాశీ విశ్వనాథం కూతురు సరళా, ఆమె స్నేహితురాళ్ళు జయా, గీతా, నిర్మలా కూడా చదువుకుందామనే తోటలోనికి వచ్చారు.

'మొట్టమొదట ప్రోజ్ చదువుదాం' అన్నది సరళ.

'రాగానే ప్రోజ్, పొయిట్రీ యేమిటే? యివాళ మన కార్యక్రమంలో మొదటిభాగం ప్రశ్నోత్తరాలు' అన్నది గీత.

'అవును అంతే' అంటూ గీతను బలపరచింది నిర్మల.

'సరళా, గీతా ఒకపార్టీ, నేనూ నిర్మలా ఒకపార్టీ' అంది జయ.

'ఓ. కే.' అన్నది సరళ.

'మొట్టమొదట మేం ప్రశ్న వేస్తాం' అన్నది గీత.

'సరే'

'అందచందాలు' సినిమాలో, అమృతవల్లి యెన్ని డ్రెస్సులు వేసుకొంది?' అని మొదటి ప్రశ్న వేసింది సరళ.

జయ కొంచెంసేపు ఆలోచించి వేళ్లు లెక్కపెట్టుకొంటూ 'తొమ్మిది' అన్నది.

'తప్పు' అన్నది గీత వెంటనే.

'ఇంటర్వెల్ కు ముందు అయిదు డ్రెస్సులు యింటర్వెల్ తర్వాత నాలుగు డ్రెస్సులు వేసుకొంది. కావలిస్తే లెక్కపెట్టుకో' అన్నది నిర్మల ధీమాగా.

'ఇంటర్వెల్ కు ముందు అమృతవల్లి చెరువులో స్నానం చేస్తున్నప్పుడు బేతింగ్ డ్రెస్సు వేసుకొంది. అది లెక్కపెట్టావా?' అని ప్రశ్నించింది సరళ.

'ఆ' అన్నది జయ ఆశ్చర్యంగా.

'ఆ సినిమాలో అమృతవల్లి మొత్తం పది డ్రెస్సులు వేసుకొంది. మీరు చెప్పలేకపోయారు కాబట్టి మాకు ఒక పాయింటు వచ్చింది' అన్నది గీత.

'సరే, ఈసారి ప్రశ్న మేం వేస్తాము' అన్నది జయ.

'ఓ. కే' అన్నది గీత.

'కనకవల్లి నటించిన ముప్పైనాల్గవ సినిమా యేది?' అని ప్రశ్నించింది నిర్మల.

'మేఘాలమేడలు' అన్నది గీత వెంటనే.

'తప్పు. కనకవల్లి నటించిన ముప్పైనాల్గవ సినిమా 'మొండిశిఖండి' అన్నది నిర్మల విజయగర్వంతో గట్టిగా.

'కాదు. మేఘాలమేడలే ముప్పైనాల్గవ సినిమా' అన్నది సరళ రెట్టించి.

ఇలాగే అమ్మాయిలు గట్టిగా మాట్లాడడం ప్రారంభించారు.

ఈ అల్లరిలో రజనీకుమార్ తన పుస్తకం చదవలేకపోయాడు. ఆ వేళ తప్పకుండా ఆ పుస్తకం అంతా చదవాలి. మర్నాడు, బోసుగారు ఆ పుస్తకంలో విషయాలను గురించి ప్రశ్నిస్తానని కూడా చెప్పారు.

'అమ్మాయిలు యింకా అక్కడేఉంటే తన చదువు సాగదు. అందుచేత వారిని

## అనగనగా...

యేదో యుక్తివలని అక్కడనుంచి పంపి వేయాలని రజనీకుమార్ బయటకు వచ్చాడు.

రజనీకుమారును చూసి అమ్మాయిలు ఒక్కక్షణంపాటు ఊరుకొన్నారుకాని తరువాత మామూలు ప్రశ్నోత్తరాల కార్యక్రమాన్ని ప్రారంభించారు.

'కాదు, మేఘాలమేడలు ముప్పై ఏడవ సినిమా.' అన్నది జయ మరింత గట్టిగా ఒక సినిమాపత్రిక చూపిస్తూ.

'రిలీజు అవడాన్నిబట్టి అయితే మేఘాల మేడలు ముప్పై ఏడవ సినిమాయే కాని నటించడాన్నిబట్టి అయితే అది ముప్పై ఎనిమిదవ సినిమాయే' అన్నది సరళ ఖచ్చితంగా. మరొక సినిమా పత్రిక పట్టుకొని.

'రిలీజు అవడాన్నిబట్టే చెప్పాలి' అన్నది నిర్మల ఖాయంగా:

ఆ మాటల్లో తను జోక్యం చేసుకుంటే తప్ప, వాళ్ళు తమ మాటల్ని మానేలాగ కనిపించలేదు రజనీకుమారుకు.

'అమ్మాయిగార్లు యిప్పుడు యేం చదువుతున్నారు?' అని అమ్మాయిలను అడిగాడు రజనీకుమార్ వాళ్ళకు దగ్గరగా వచ్చి.

'బి, యే చదువుతున్నాం' అంది గీత సగర్వంగా.

'మీరు కాలేజీలో చదువుతున్నది కాదు నేను అడిగింది. ఇప్పుడు మీరు ఆ పుస్తకాలు పట్టుకొని యేం చదువుతున్నారు?' అని అడిగాడు రజనీకుమార్ అమ్మాయిల చేతుల్లో ఉన్న సినిమా పత్రికలను చూపిస్తూ.

'అమ్మాయిలు తమ చేతుల్లో ఉన్న సినిమా పత్రికలను చూసుకొని ఒకక్షణం సేపు మాట్లాడలేక పోయారు కాని వెంటనే సర్దుకొన్నారు.

'అదే బి. యే, పరీక్షలు వస్తున్నాయి కదా ! అందుకోసం చదువుకొంటున్నాం' అంది గీత.

'ఏవో సినిమాలు అని అంటున్నారు కదా. అదికూడా బి. యే. పరీక్షలో ఉంటాయాండీ?' అని ప్రశ్నించాడు రజనీకుమార్ అమాయకునిలాగ.

'సినిమాలుకూడా బి. యే. పరీక్షలో ఉంటాయా ? అని మెల్లగా అడుగుతున్నారా ? మొత్తం పరీక్ష పేపర్లన్నీ సినిమాలగురించే ఉంటాయి' అని ఖచ్చితంగా అన్నది నిర్మల.

'మరి మీరు మొదట యేవో ప్రోజు, పొయెట్రీ అన్నారు కదా: అవి పరీక్షలో ఉండవాండీ ?' అని తిరిగి ప్రశ్నించాడు రజని.

'అవే ప్రోజు అంటే సినిమాలో మాటలూను, పొయెట్రీ అంటే సినిమా పాటలూను. అంతే' అన్నది జయ.

'అంతేనాండీ ?' అని తిరిగి అడిగాడు రజనీకుమార్.

'నేను పూర్తిగా చెపుతాను వినండి. బి. యే. పరీక్షలో మొత్తం నాలుగు పేపర్లు ఉంటాయి. మొదటిపేపర్లో యేనటులు యేసినిమాలో యేడ్రస్సులు వేసుకొన్నారు ? యెన్ని డ్రస్సులు వేసుకొన్నారు ? అనే ప్రశ్నలు ఉంటాయి' అంటూ సరళ చెప్పడం ప్రారంభించింది.

'రెండవ పేపర్లో యేనటులు యే సినిమాలో యేం మాట్లాడారు ? యెవరితో యెన్నిసార్లు మాట్లాడారు ? అని ప్రశ్నలు ఉంటాయి.

మూడవపేపర్లో యేనటులు యే సినిమాలో యెన్నిపాటలు పాడారు ? హీరో, హీరోయిన్లు కలిపి పాడినపాటలు యెన్ని ? విడిపాటలు యెన్ని ? ఆ పాటలు యెవరు రాశారు ? ఒక్కొక్కపాటలో యెన్ని అక్షరాలు




### డా. భాభా

(జననం: 1909) ప్రపంచ ప్రసిద్ధ వైజ్ఞానికులలో అగ్రస్థానం అలంకరించిన హోమీ జహంగీర్ భాభా ప్రముఖ చిత్రకారులుకూడ. కాస్మిక్ కిరణ పరిశోధకుడైన ఈ వైజ్ఞానిక కళాకారుడు ప్రియలిస్టిక్ చిత్రాలను చిత్రీకరించే కళాకార వైజ్ఞానికుడు కూడ.

మొట్టమొదటగా లండన్‌లో 16, 17 ఏండ్లక్రిందట జరిగిన వీరి చిత్ర ప్రదర్శనతో లోకమంతా ఆశ్చర్య పోయింది. వీరి చిత్రాలపై పిల్‌గ్రేకో ప్రభావం కనిపిస్తుంది. ఆ తర్వాత రచించిన వీరి అమూర్త చిత్రాలు ఘన వాద, ప్రభావవాద, యదార్థవాదాల సమ్మిశ్రిత రూపాలు.



టాటా యిన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెటల్ రిసెర్చిలో వీరి చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. వినాశకర పరమాణుశక్తిని శాంతియుత కార్యాల యందు వినియోగించదలచే వీరి కళాత్మక దృష్టికి ప్రత్యక్ష కళాకృతులే టాటా యిన్‌స్టిట్యూట్, పరమాణు శక్తి సంస్థలు. వీరు 1966 లో విమాన దుర్ఘటనలో యిహలోక యాత్ర చాలించేరు.

ఉన్నాయి? అనే ప్రశ్నలు ఉంటాయి.

నాల్గవ పేపర్లో యేనటులు యే సినిమాలో యెన్ని కత్తియుద్ధాలు చేశారు? యెన్ని గుర్రపుస్వారీలు చేశారు? యెన్ని సార్లు మోటారుకారు నడిపారు? అనే ప్రశ్నలు ఉంటాయి. ఈ నాలుగు పేపర్లలోని ప్రశ్నలకు సరిగ్గా సమాధానాలు రాస్తే, బి. యే పరీక్ష పాసయి పోయినట్లే వెంటనే బి యే. పట్టా యిచ్చేస్తారు' అని బి యే పరీక్షను గురించి కుమారస్వామికి చెప్పింది సరళ.

'కుమారస్వామికి యేమీ తెలియదు అందుచేత మనం యేం చెప్పినా ఫరవా లేదు' అనే నమ్మకంతో అమ్మాయిలు అతనిదగ్గర తమ యిష్టం వచ్చినట్లు కోతలు కోశారు.

అతనుకూడా యేమీ తెలియని వాడిలాగ వాళ్లకోతలన్నీ ఓపిగ్గా విన్నాడు.

'ఇంతకూ నువ్వేం చదివావు?' అని అతన్ని ప్రశ్నించింది నిర్మల.

'చిన్నప్పుడు అయిదోక్లాసు చదివానండి!'

'మరి తరువాత సినిమాలగురించి యేం చదవలేదా?' అని అడిగింది గీత.

'ఓ? సినిమాపాటల పుస్తకాలు కథల పుస్తకాలు అన్నీ చదివాను' అన్నాడు అతను సగర్వంగా.

'మరయితే నువ్వూ బి. యే. పరీక్షకు కట్టవచ్చును' అన్నది జయ.

'నేను బి. యే పరీక్షకు కడితే పాసవుతానాండి?' అని అడిగాడు కుమారస్వామి.

'సినిమాల గురించి అంతా నీకు తెలిస్తే, బి యే. పరీక్ష ఫస్ట్‌క్లాసులో పాసవుతావు' అన్నది గీత.

'అసలు సినిమాల గురించి నీకు యెంత తెలుసునో ముందు మేం పరీక్ష చెయ్యాలి' అన్నది సరళ.

'ఇదివరకు నాకు అంతా తెల్సునండి. ఈ మధ్యనే కొంత మర్చిపోయాను. మీ దగ్గర ఉన్న ఆ పుస్తకాలు ఒకసారి నాకు యిస్తే, నేను చదువుతాను ఆ తరువాత మీరు నన్ను పరీక్ష చెయ్యవచ్చును' అన్నాడు కుమారస్వామి వినయవిధేయతతో.

'అయితే, సరే, యివిగో పుస్తకాలు నువ్వు చదువుకొని, జాగ్రత్తగా మళ్ళా యిచ్చెయ్యాలి' అంటూ సరళ కుమారస్వామికి సినిమా పాటల పుస్తకాలు, పత్రికలు యిచ్చింది.

'అమ్మాయిగారు చాలా మంచివారు' అంటూ కుమారస్వామి ఆ పుస్తకాలు, పత్రికలు పుచ్చుకొన్నాడు.

ఇంతలో కాశీవిశ్వనాథం యెక్కడనుంచో కారులో వచ్చాడు. అతను కారు దిగేసరికి చెట్టుకింద ఉన్న సరళా, ఆమె స్నేహితురాళ్ళు కన్పించారు. వెంటనే అతను 'సరళా' అని పిలుస్తూ అక్కడకు వచ్చాడు.

అతని పిలుపు వినబడగానే, సరళా, ఆమె స్నేహితురాళ్ళూ కూడా లేచి నిలబడ్డారు.

'ఇక్కడ యేం చేస్తున్నారు?' అని సరళనుఅడిగాడుకాశీవిశ్వనాథం దగ్గరకువచ్చి.

'చదువుకొంటున్నామండి, నాన్నగారూ' అన్నది సరళ యెంతో బుద్ధిమంతురాలువలె.

వెంటనే కుమారస్వామి కాశీవిశ్వనాథానికి నమస్కారం చేసి 'బాబుగారూ! నేను కూడా బి. యే. పరీక్ష పాసవుతానండి. నాచేత కూడా బి. యే. పరీక్ష కట్టించండి' అన్నాడు బ్రతిమాలుతున్నట్లుగా.

'నువ్వేమిటి? బి యే పరీక్ష కట్టడమేమిటి?' అని అడిగాడు కాశీవిశ్వనాథం ఆశ్చర్యపోతూ.

'అమ్మాయిగారు అంతా నాకు చెప్పారండి! బి. యే. పరీక్షలో నాలుగు పేపర్లు ఉంటాయట' అంటూ కుమారస్వామి చెప్పడం ప్రారంభించాడు.

'ఏం చెప్పావా?' అన్నట్లుగా కాశీవిశ్వనాథం కుమార్తె వైపు చూశాడు.

తేలుకుట్టిన దొంగలాగ సరళ ఊరుకుంది. తండ్రి మళ్ళా కుమారస్వామి వైపు తిరగ్గానే 'మా నాన్నగారితో చెప్తే

# అసలైన వినాశహేతువు ఏది?

బులుసు వెంకటరమణయ్య—ధర్మపథం

వినాశానికి ఎన్నో కారణాలు పని చేస్తాయి కొన్ని ఆలస్యంగా పనిచేస్తాయి. కొన్ని మాత్రం శీఘ్రంగానే తమ ప్రభావాన్ని చూపుతాయి. అట్టి శీఘ్రహేతువులలో ప్రధానమైనది మోహం. దానిమూలంగానే రావణుడు సర్వనాశానికి గురి అయిన సంగతి అందరికీ తెలుసు అది సహజన్మల విరోధానికీ, పరస్పర వినాశానికీ కూడా దారి తీస్తుంది

నికుంభుడు అనే రాక్షసునికి ఇద్దరు కుమారులు ఉండేవారు వారి పేర్లు సుందుడూ, ఉపసుందుడున్నూ వారిద్దరూ గొప్ప బలవంతులు. వారు బ్రహ్మను గురించి గొప్ప తపస్సుచేసి ఆయనను ప్రత్యక్షం చేసుకున్నారు 'ఏం కావాలి?' అని బ్రహ్మ ప్రశ్నించాడు కోరిన రూపాన్ని ధరించే శక్తి, మాయావిత్వం, మరణం లేకుండా ఉండడం అనే మూడు వరాలనూ వారు కోరారు. అప్పుడు బ్రహ్మ 'మరణించకుండా ఉండడం ఎవ్వరికీ సాధ్యం కాదు ఆ వరం తప్ప తక్కిన వరాలు ఇస్తాను. వాటితో తృప్తిపడండి' అన్నాడు వారు దానికి సమ్మతించవలసి వచ్చింది.

ఇతరులను ఏడిపించడమే వారి స్వభావం తమ బలానికి బ్రహ్మ యిచ్చిన వరాలు ఆసరా కాగా, ఆ సోదరులు దేవతలనూ, మునులనూ నానాహింసలూ పెట్టేవారు. ఆ రాక్షసులబాధ పడలేక మునులూ, దేవతలూ బ్రహ్మవద్దకు పోయి మొరపెట్టుకున్నారు వాళ్లను యితరులు చంపడం సాధ్యం కాదనీ, పరస్పరం పొడుచుకొని చావవలసినదేననీ బ్రహ్మకు తెలుసును ఈ సంగతి ఆయన దేవతలకూ, మునులకూ తెలిపి, వాళ్లు ఆ విధంగా చనిపోయే ఉపాయాన్ని తానే ఆలోచిస్తానని వారికి ధైర్యం చెప్పి పంపివేశారు తర్వాత విశ్వకర్మను పిలిచి, తిలోత్తమ అనే లోకోత్తరమైన అందకత్తెను సృజింపవలేనని చెప్పాడు. ఆ రీతిగా సృజించబడిన తిలోత్తమను చూచి 'సుందోపసుందులకు పరస్పరం వైరం కలుగచెయ్యి' అని ఆదేశించాడు

తిలోత్తమ సుందోపసుందు లున్నచోటికి పోయింది, ఈమె సౌందర్యానికి వారిద్దరూ ముగ్ధులై ఒకర్ని మించి మరొకరు తన్ను వరించాలని కోరారు 'మీ ఇద్దరిలో ఎవరు రెండోవానిని పోరులో పొడిచి, గెలుపొంది వస్తాడో, అతనినే వరిస్తాను' అని తిలోత్తమ చెప్పింది. సమానబలం కల వారిద్దరూ పోరి, ఒకరి నొకరు పొడుచుకొని మరణించారు.

ఈ రీతిని సుందోపసుందులవల్ల దేవతలకూ, మునులకూ బాధ తప్పింది. తిలోత్తనుపై వారికి ఉండిన మోహమే వారిద్దరి వినాశానికీ కారణమైంది.

పరస్పరం కలహించి వినాశం పొందిన వారికి సుందోపసుందులతోడి సామ్యం అప్పటినుంచీ ప్రసిద్ధికి వచ్చింది. ●

---

చూడు! నిన్ను యేం చేస్తానో' అన్నట్టుగా సరళ తండ్రికి కన్పించకుండా కుమారస్వామిని బెదిరించింది.

కుమారస్వామి సరళ బెదిరింపులను గమనించనట్లుగా, కాశీవిశ్వనాథంగారితో 'మొదటి పేపర్లో సినిమా [illegible]

## అనగనగా...

రెండవ పేపర్లో సినిమా యాక్టర్ల మాటల గురించీ, మూడవ పేపర్లో సినిమా పాటలగురించీ, నాల్గవపేపర్లో సినిమాల్లో జరిగిన కత్తియుద్ధాల గురించి [illegible] పాసయిపోతారటండీ! అమ్మాయిగారు చెప్పారు' అన్నాడు.

కాశీవిశ్వనాథం సరళవైపు మళ్లా చూశాడు ఆమె యేమీ మాట్లాడలేదు. కాశీవిశ్వనాథం మళ్లా కుమారస్వామివైపు తిరగ్గానే 'మా నాన్నగారితో యింకేం చెప్పవద్దు నీకు దణ్ణం పెడతాను' అన్నట్లుగా తండ్రికి కన్పించకుండా కుమారస్వామికి దణ్ణం పెట్టింది.

కుమారస్వామి సరళవైపు చూడకుండా కాశీవిశ్వనాథంగారితో 'అమ్మాయిగార్లందరూ యింతసేపూ యివే చదివారండీ. 'ఈ పుస్తకాలు చదివితే నువ్వుకూడా బియేపరీక్ష పాసవురావు' అని చెప్పి నాకు యీ పుస్తకాలు యిచ్చారండీ' అని సినిమా పుస్తకాల కట్ట మీదకు యెత్తి విశ్వనాథంగారికి చూపించాడు

సరళా, ఆమె స్నేహితురాళ్లు కుమారస్వామితో చెప్పిన కబుర్లకు, కాశీవిశ్వనాథానికి నవ్వు వచ్చింది. కాని ఆయన దాన్ని పైకి కన్పించనియ్యలేదు.

'ఇక్కడ కూర్చుని మీరు చదివేది యిదేనన్నమాట. పదండి యింట్లోకి' అన్నాడు కాశీవిశ్వనాథం యెంతోకోపం వచ్చినట్లుగా.

అమ్మాయిలందరూ యేమీ మాట్లాడకుండా కాశీవిశ్వనాథం వెనుకనే బయల్దేరారు

కుమారస్వామి కాశీవిశ్వనాథం వద్దకు వెళ్లి 'బాబుగారూ! నా బి. యే పరీక్షమాట యేమిటంటారు?' అన్నాడు మళ్లా.

'ముందు ఈ పుస్తకాలు బాగా చదువు. తరువాత పరీక్షమాట చూద్దాం. ఆ పుస్తకాలు అమ్మాయిలకు తిరిగి యివ్వవద్దు' అని చెప్పి కాశీవిశ్వనాథం అక్కడనుంచి వెళ్లిపోయాడు.

సరళ మళ్లా ఒకసారి వెనక్కుతిరిగి 'చూడు నిన్నేం చేస్తానో' అన్నట్లుగా వేలుతో బెదిరించి తండ్రికూడా వెళ్లిపోయింది.

'సరే, అది చూద్దాం' అన్నట్లుగా కుమారస్వామి ఒకసారి తల యెగరేసి తాతయ్య యింట్లోకి వెళ్లిపోయాడు.

(ఇంకా ఉంది)




(గత సంచిక తరువాయి)

ఒకసారి ..

'పంచాయతీ ఎలక్షన్లు వచ్చాయి. చివరికి ఇద్దరు అభ్యర్థులు నిలబడ్డారు. వీళ్ళ పొరపాటున వేరొక అభ్యర్థికి మాట ఇచ్చారు. తర్వాత ఆ నిర్ణయానికే కట్టుబడ్డారు. పోటీలో చిత్తశుద్ధితో పనిచేసి ఆ తర్వాత ఎప్పటిలాగే స్నేహంగా వుండాలని వాళ్ళ వుద్దేశ్యం. అది వాళ్ళకి సాధ్యంకాలేదు. పోటీ ఎంత తీవ్రంగా జరిగిందంటే యిద్దరు ఒకళ్ళ నొకళ్ళు నిందించుకున్నారు. ఒకళ్ళ కొకళ్ళు శత్రువుల్లా కనబడ్డారు.

'మావాడు బాగా తొందరపాటు మనిషని చెప్పానుగా. ఎలక్షను వేడిలో యింకా తొందరపడ్డాడు. 'అతని మాట లెక్క ఏమిటోయ్. వాళ్ళ అమ్మకి పెళ్ళికాకుండా పుట్టిన మనిషి'...అన్నాడట. ఆ విషయం అబద్ధం కాదు. అతను పుట్టాకనే వాళ్ళ అమ్మ నాన్న పెళ్లి చేసుకున్నారు. నేను మా వాడిని సమర్థించడం లేదు.

'అతను చాలా బాధపడ్డాడు. వెంటనే ఇల్లు ఖాళీచేసేసి ఆ వాటా అద్దెకిచ్చేశాడు ఇంకోచోట అద్దె యింట్లోకి మారిపోయాడు.

'నేను మా వాడిని క్షమాపణ చెప్పకోమన్నాను. ఎలక్షను వేడిలో వున్నాడు. చెప్పకోనన్నాడు. ఎలక్షను అయిన తర్వాత కూడ ఆ పంతం మీదే వున్నాడు.

'నా మనసు విరిగిపోయింది. వాళ్ళు విడిపోవడానికి పరోక్షంగా కారణం నేనే అయ్యాను. ఎందుకంటే అతని తల్లిదండ్రుల విషయం నా ద్వారానే మా వాడికి తెలిసింది. మా ఆవిడతో ఏదో సందర్భంలో చెబుతోంటే విన్నాడు మరో వూరిలో జరిగిన విషయం నా కొక్కడికే తెలుసు.

'వాళ్ళయిద్దరూ కలవాలని ఎంతగా కోరుకున్నానో అంత అశక్తుడనయ్యాను. నాకు యిప్పుడు, యీ ఆపరేషన్ అవుతున్నప్పుడు వాళ్ళు తిరిగి కలవాలని కోరిక ఎక్కువయ్యింది...అదే జరిగితే నాకు ఆరోగ్యం ఎలా వున్నా చింతలేదు...ఆయువు ఎంత తగ్గినా బాధలేదు...' అన్నారాయన లోతయిన కళ్ళలోంచి ఆశలేని చూపు చూస్తూ.

రాజారావుగారు చాలాసేపు మాట్లాడలేకపోయారు. తర్వాత 'ఇంతకీ ఆ స్నేహితుడెవరండీ' అన్నారు.

'పేరు తెలుసుకోవాలని వుందా! అతని

పేరు నీలకంఠం' అన్నారు పరంధామయ్య గారు.

రాజారావుగారు ఆశ్చర్యపోయారు. ఏదో పొరపడిపోయి తమాయించుకున్నారు ఇదేమీ గమనించని పరంధామయ్యగారు మాట్లాడుతున్నారు.

'రాక రాక వచ్చి నీకు బాధ కలిగిస్తున్నట్లున్నాను నా విషయాలు చెప్పి. నాకు ఏలు ఒదే ఆపరేషను. అసలు సంగతి చెప్పడం మరచిపోయాను నా మనవరాలు రాణి నీకు తెలుసుగా, ఎల్లుండివస్తోంది' అన్నారాయన

రాజారావుగారికి చాలా వుత్సాహం కలిగింది 'రాణీని చూడాలి, చూసి చాలాకాలం అయింది' అన్నారు

ఆయన ముఖం ఆనందంతో వెలిగింది. తన కిష్టమయిన వ్యక్తిని చూడబోతున్న ఆనందం ఆయన ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది

రాణీ ఆయన యింటికి బంతిపూల కోసం వచ్చేది 'బంతిపువ్వుల అమ్మాయీ' అని పిలిచేవాడు

'అలా పిలిస్తే పలకను' అనేది. 'పోనీ పట్టాలు ఘల్లుఘల్లుమనిపిస్తూ వుంటావు 'పట్టాల అమ్మాయి' అని పిలవనా' అనేవారు

కాటుక మొహం అంతా చేసుకొన్నప్పుడు 'కాటుక అమ్మాయి' అనీ, గోరింటాకు కోసంవస్తే 'గోరింటాకు అమ్మాయి' అనీ పిలిచేవారు.

ఎప్పుడూ యిక్కడికి వచ్చేది రాజారావుగారి భార్యచేత రోజుకోరకం జడవేయించుకునేది.

ప్రతిరోజూ వినాయకుడి గుడికి ప్రసాదాల వేళకి రాజారావుగారిని తీసుకుని వెళ్ళేది రాణీ దేవుడికి మూడు ప్రదక్షిణలుచేస్తే గాని ప్రసాదం పెట్టననేవాడు పూజారి దృష్టి ప్రసాదంమీద వుండగా దేవుడి చుట్టూ ప్రదక్షిణాలు చేసేవాళ్ళు రాణీ, పద్మ. తొందరగా ప్రదక్షిణాలు అయిపోవటానికి పరిగెత్తే వాళ్ళు పరిగెడితే పుణ్యం రాదని, మళ్ళీ మెల్లగా నడుస్తూ ప్రదక్షిణ చెయ్యమనేవాడు పూజారి ఆ తర్వాత అడిగినంత ప్రసాదం పెట్టేవాడు. తన ప్రసాదంలో కొంత రాజారావుగారికిచ్చి ఆయన ప్రసాదంలో కొంత తను తినేది రాణి.

'పద్మ, రాణి, పరంధామయ్యగారు— ఈ ముగ్గురంటే చాల యిష్టం వుంది రాజారావుగారికి వాళ్లకెప్పుడూ మంచి జరగాలని కోరుకుంటారు. వాళ్ల సమస్యలు సొంత సమస్యల్లా బాధిస్తాయి. వాళ్ల క్షేమం తనక్షేమంలా వుంటుంది.

అందుకే రాణీ వస్తోందనగానే ఆయన కంత సంతోషం.

'అన్నట్లు రాణీని ఈవూరే యిస్తున్నాము' అన్న పరంధామయ్యగారి మాటలతో మళ్లీ ఈలోకంలోకి వచ్చారు రాజారావుగారు.

'ఈవూరా? ఎవరబ్బాయి?'

'రాజగోపాలరావు గారని కాస్త వున్నవాడే ఎందుకో మన సంబంధం అంటే ఒప్పుకున్నారు. ఒప్పుకోవడమేకాదు, పట్టుదలగా కూడ వున్నారు అబ్బాయి యింటరు చదివాడు వ్యాపారం చేస్తున్నాడుట. అన్నిటికన్నా ముఖ్యం పిల్లని కుర్రవాడు ఇంతకుముందే చూశాడుట, కట్నం కానుకలు లేకుండా ఒప్పుకున్నాడు' అన్నారాయన

'నాకొక రాజగోపాలరావుగారు తెలుసు. ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో పనిచేసి ఏడాదిక్రితం రిటైరయాడు.'

'ఆయన వుండేది ఎక్కడ?'

'దీపాలవారి వీధిలో'

'అయితే ఆయనే. నీకు ముందే తెలుసన్న మాట!'

'తెలుసు,' అన్నారేగని రాజారావుగారిలో వుత్సాహం లేదు రాజగోపాలరావు గారి అబ్బాయికూడ తెలుసు పచ్చి వ్యసనపరుడు అసహ్యించుకోదగిన జూదగాడు అలా కనిపించడు అంతే

అయితే కుదిరిన పెళ్లిని నిజంచెప్పి చెడగొట్టాలా? పెళ్లితో ఎలాంటి వ్యసనాలైనా పోతాయని సమాధాన పడాలా?

రాజారావు గారికైతే ఈ సంబంధం ఏమాత్రం ఇష్టంలేదు. అయితే తనకై తను మాట్లాడ దలచుకోలేదు. వాళ్ళు పట్టుబట్టి అడిగితేనే చెబుతామనుకున్నాడు. కాని, తన ప్రాణ సమానమయిన రాణి జీవితం పాడవుతోందని భయం. ఆడపిల్లకి పెళ్లికుదరడం కష్టంగా వున్నరోజుల్లో ఏదోవొకటి చేసి తల్లిదండ్రులు బరువు తీర్చుకుంటున్నప్పుడు తను అడ్డుపడటం భావ్యమా? ఈ సంబంధం తప్పిస్తే మళ్లీ ఇంకోసంబంధం ఈమాత్రం సవ్యమైనది వాళ్లు చూస్తారా? రాజారావుగారు ఆలోచిస్తున్నారు.

రాజారావుగారికీ సందర్భంలో మరో సంగతి గుర్తుకు వచ్చింది ఈ రాజగోపాలరావుగారు ఎవరోకాదు. రామకృష్ణకి వరుసకి మామయ్య అవుతాడు. ఈ విషయం రామకృష్ణద్వారా తెలిసింది. అప్పుడు అతను గోపాలరావు కొడుకుని గురించి కూడ కొంత చెప్పాడు. తమకి వాళ్లతో రాకపోకలు లేవని, కుటుంబాలు విడిపోయాయని కూడా చెప్పాడు.

* * *

మర్నాడు రాణి వచ్చింది రాజారావుగారు పరంధామయ్యగారికీ, చేమ్రాదికి చెప్పి రాణిని తన యింటికి తీసుకు వచ్చాడు. రాణీ, పద్మ మాట్లాడుకున్నారు.

పద్మ, రామకృష్ణ సంగతి తప్ప అన్నీ మాట్లాడింది అతని సంగతి ఎత్తలేదు ఆ విషయం ఏమీ నిర్ణయం కానిదానికి అతన్ని గురించి చెడ్డ అభిప్రాయం కలిగించటం ఆమె కిష్టంలేక పోయింది.

'నీ పెళ్ళి కుదిరిందటమ్మా' అన్నారు రాజారావుగారు రాణి తనకి మంచినీళ్లు అందిస్తున్నప్పుడు పద్మ లేదు అప్పుడు.

'అవును' అంది తలవంచుకుని

'నీలకంఠంగారని మీనాన్న స్నేహితుడు లేడూ. ఆయనకి పెత్తల్లి అల్లుడు రాజగోపాలరావుగారు. నాకు రామకృష్ణ చెప్పాడు.'

'ఎవరైతే నాకెందుకు?' అంది రాణీ పట్టించుకోకుండా.

'ఏం అలా అంటున్నావు?' అన్నారాయన ముందుకు వంగి

'మీరు తండ్రిలాంటివారు. మీదగ్గర దాచడం ఎందుకూ నాకు ఆ సంబంధం యిష్టంలేదు' అంది.

'ఎందుకని?'

'నాకతను నచ్చలేదు.'

'ఏం?'

'ఏమో అతనేకాదు ఎవరూ నచ్చరు నాకు మా బావనే పెళ్ళిచేసుకోవాలనుంది' అంది

'ఏను మేనరికం వుందా? అయి

జయాట సంబంధానికెందుకెళ్ళాడు మీ నాన్న?'

'మొదట్లో యిష్టమే మా నాన్నకీ ఒప్పుకున్నప్పుడు కూడ తాతయ్యా జబ్బు విషయం, ఆపరేషను విషయం కనుక్కుందామని ఎక్కడికి వచ్చినప్పుడు ఈ రాజారావుగారితో పరిచయం అయిందట. [illegible] డబ్బుచూసి నేనా యింట్లో సుఖపడాలనుకున్నారు. ఏక్షణాన తోచిందో అదే పట్టుగా కూర్చున్నారు మా బావ సంగతి ఆలోచించడం మానివేశారు. ఇదే [illegible]'

'మరి [illegible]ప్పలేదా?'

'[illegible]కి చెప్పాను తాతయ్య మా నా[illegible] అడిగారు. 'రాణీ నీ కూతురా? [illegible]?' అని అడిగారు నాన్న. [illegible] అప్పైన మాట్లాడలేదు. మా [illegible] మీకు తెలుసుగా. వాడు [illegible] 'నన్ను ఒక అంటను పైనున్న [illegible] యివ్వాలి' అన్నారు 'నిజమే [illegible] యిప్పుడే యిష్టాలు చూడక్క[illegible]' అన్నాడు అన్నయ్య ఈ విషయంలో [illegible], నాన్న తీవ్రంగా ఘర్షణపడ్డారు. [illegible] పంతాలు పెరిగి మాటలు [illegible]. అన్నయ్య ఇంక పెళ్లి సెలవు [illegible] హాస్టలుకి వెళ్ళిపోయాడు. 'వాడే మొహం వాడే వస్తాడు' అన్నారు [illegible] నాన్న పంతం పంతమే. బహుశా మరో నాలుగురోజులలో తాంబూలాలు తీసుకుంటారేమో' అంది విచారంగా

'అయితే మీ బావని చేసుకునే మార్గం లేదా?'

'నాన్నకి బావంటే అయిష్టంలేదు. మేము స్థితిపరులము కాకపోవడంతో శ్రీమంతుల సంబంధం వాళ్ళంతటవాళ్ళు వచ్చి అడగటంతో నాన్న మనసు మారింది మా స్థాయికి ఆ సంబంధం ఎక్కువని నాన్నకి తెలియకపోలేదు అనుకోకుండా వచ్చిన ఈ అవకాశాన్ని వదులుకోకూడదన్న వుద్దేశ్యంతో నాన్న ఈ సంబంధాని కెగబడ్డారు ఒకవేళ ఏ కారణంవల్లనైనా ఈ సంబంధం జరక్కపోతే మా నాన్న నన్ను మా బావకిచ్చి పెళ్లిచేయడంలో సందేహం లేదు కానీ, ఇప్పుడు నాకీ పెళ్లి తప్పే సూచనలు లేవు.'

'ఎందుకు?'

'పెళ్లికొడుకు నాకింతకుముందే తెలుసు చదువుకునే రోజుల్లో నావెంట పడేవాడు. ఒకసారి ఘర్షణ పడ్డాము కూడ. ఆనాడే పంతం పట్టాడు నన్నెలాగైనా పెళ్లి చేసుకుంటావని. అవకాశం కలిసి వచ్చింది. వాళ్లనాన్నగారిచేత మా నాన్నని అడిగించాడు.' అంది రాణి దుఃఖంతో. రాణి కంఠంలో వచ్చిన వణుకు గమనించా రాయన.

'మరేం చేస్తావు?'

'పెళ్లి కుదిరితే ఏం చేస్తాను? నాకు తెలిసి చాలమంది ఆడపిల్లలు ఇష్టంలేని పెళ్లిళ్లు చేసుకున్నారు. నాకూ అదే ప్రాప్తం అనుకుంటాను' అంది

రాజారావుగారి గుండెలో గాయం అయినట్లయింది ఎవరికైతే సమస్యలు రాకూడదని తను అనుకుంటాడో ఆ పద్మ, పరంధామయ్యగారు 'రాణి' సుగ్గుకి జటిలమైన సమస్యలున్నాయి ముగ్గురివి మూడు విడదీయిలేని చిక్కులు

* * *

పరంధామయ్యగారి ఆపరేషను అయిపోయింది. ఆపరేషన్ సక్సెసే కాని, డాక్టరు గమనించినదాన్ని బట్టి ఆయన ఎక్కువ కాలం బతకరు. కొన్నివారాల [illegible]ముంది. అంతే

'నువ్వు మావూరు వచ్చి చాలాకాలం అయింది. నాయిల్లు, పిల్లలు అందర్నీ చూపిస్తాను. నేను చచ్చిపోయేలోగా [illegible] వాళ్లకి నా ఆత్మబంధువులాంటి నిన్ను చూపిస్తాను' అన్నారు పరంధామయ్యగారు.

రాజారావుగారు ఒప్పుకున్నారు.

రామకృష్ణ దగ్గర్నుంచి ఉత్తరం రాలేదు పద్మకి రోజురోజుకీ ఆశ తగ్గిపోతోంది. ఈ పరిస్థితుల్లో తనే అల్లుడు వెళ్లి విషయం కనుక్కోవాలను కుంటు న్నాడు ఇప్పుడు పరంధామయ్యగారు రమ్మంటున్నారు.

* * *

రాజారావుగారు లక్ష్మీపురం చేరుకున్నారు. పరంధామయ్య గారింట్లో దిగారు. ఇంట్లోవాళ్ళని అయినంతవరకూ పరిచయం చేసుకున్నారు. శంకరం ఊళ్లో లేడు.

అయితే, అక్కడి పరిస్థితుల్లో ఎంతమాత్రం మార్పు కనబడలేదు పరంధామయ్యగారు చెప్పినట్లే, రాణి చెప్పినట్లే వున్నాయి. నీలకంఠంతో వైరం విషయంలోగాని, రాణి పెళ్లి విషయంలోగాని కేష్మాద్ర అభిప్రాయం కించిత్తు కూడా వదలపోవడం గమనించారు. రామకృష్ణ విక్కి తాగుతున్నట్లుగా కూడా తెలుసుకున్నారు ఆయన.

ఆయన మనస్సు కల్లోలం అయి



పోయింది. ప్రశాంతంగా వుంటుందని వూరు బయట చెరువు దగ్గరికి ఆ సాయంత్రం బయలుదేరారాయన. చెరువుపొడ్డున తోట లోకి వెళ్లారు. చెట్టు వేళ్ల మీద కూర్చుని చెరువులోకి రాయి విసురుతూ ఆలోచిస్తు న్నారు

చెరువుచుట్టూ చెట్లు దట్టంగా అందంగా వున్నాయి.

అందమైన ప్రకృతి ఆయనకు ప్రశాంతత చేకూర్చలేక పోతూంది.

తన సమస్యలు చిక్కులు ఆయనకు పదేపదే జ్ఞాపకం వచ్చి వేధిస్తున్నాయి తన సమస్యలు కదాన్నిమించి ఒకటున్నాయి ఏదీ యిదావేయదగ్గ సమస్యకాదు ఎలా తీరతాయో ఏమిటో ?

తనకూతురు పద్మ పెళ్లి రామకృష్ణతో జరగాలంటే తను పదివేలు కట్నం అన్నా ఈయాలి ఇది అసంభవం లేకపోతే, అనిటిపిల్ల బాలని కట్నంలేకుండా ఎవరన్నా చేసుకోవాలి ఇది మరీ అసంభవం.

రాణీకి దాని బావతో పెళ్లిజరగాలంటే రాజగోపాలరావుగారి కొడుకుతో వివాహం రద్దు కావాలి కానీ, చూస్తూ చూస్తూ శ్రీమంతుల సంబంధాన్ని అంత తేలిగ్గా పోనిచ్చే వ్యక్తికాదు శేషాద్రి తను పంతం పట్టి చేసుకుంటానన్న పిల్ల రాణిని వదలడు ఆ వరుడు

నీలకంఠం, శేషాద్రిలమధ్య పేరుకు పోయిన వైషమ్యం తీరిపోవడం, పరంధామయ్యగారికి సంతోషం కలగడం మరీ అసాధ్యం.

ఈ మూడూ విడదీయలేని చిక్కులు కలిసి ఒక చిక్కుముడి

ఏదైనా అద్భుతం జరిగితేతప్ప ఈ సమస్యలు ఎప్పట్లో తీరేలా కనిపించలేదు రాజారావుగారికి

ఒంటరిగా ఆ తోటలో అలా కూర్చుంటే ఆయనకి ఒకటే అన్పించింది. ఇప్పుడు ఏ దేవుడో కనబడి 'ఇదుగో ఒక సంఘటన కల్పిస్తున్నాను. ఇప్పుడు నీ కళ్లముందు జరుగుతుంది దానితో నీ సమస్యలు మూడూ తీరిపోతాయి' అని చెబితే బాగుండును అనిపించింది.

ఆలోచనలతో అలసిపోయిన రాజారావు గారికి, మాగన్నుగా నిద్రపట్టింది.

అలా ఎంతసేపు పడుకున్నారో ఏమో గాని, దూరంగా చిన్న అలికిడికి మెలకువ వచ్చింది.

ఎదురుగా చెరువుగట్టుమీద కూర్చుని చెరువులోకి సరదాగా గులకరాళ్లు విసురుతున్న 'జంట' కనిపించింది. వాళ్లు కబుర్లు చెప్పుకుంటున్నారు ఇద్దరిదీ చిన్నవయసే. పెళ్లిచేసుకునే వయసు వాళ్లు తనని చూడటం లేదు

ఆ అబ్బాయిని ఎక్కడో చూసినట్లని పించింది ఆయనకి, ఇంకొకసారి పరీక్షగా చూశారు పూర్తిగా శేషాద్రి పోలిక. అతను శంకరం !

ఆశ్చర్యం వేసింది ఆయనకి. శంకరం వూళ్లోకి వచ్చాడని యింట్లో ఎవరికీ తెలీదు ఇంటికి రాలేదు అతను ఎప్పుడు వచ్చాడు ? పక్కన అమ్మాయి ఎవరు ?

అంతలో వాళ్లు లేచివెళ్లడం చూశారు. నడకనిబట్టి తెలుసుకున్నారు ఆ అమ్మాయి ఎవరో

రాజారావుగారి కళ్లు మెరిశాయి. సంభ్రమంతో రెప్పలార్పకుండా చూశారు. పట్టలేని ఆనందంతో ఒళ్లు పులకరించి పోయింది. రక్తం వుత్సాహంతో పరవళ్లు

తొక్కింది శరీరం అంతా చైతన్యవంతం అయింది. అప్పుడే మనస్సులోనే కృతజ్ఞత చెప్పుకున్నారు,

ఆ అమ్మాయి బాల !!

*   *   *

శంకరం కాసేపయ్యాక యింటికి వచ్చాడు. తర్వాత కాసేపటికి అతన్ని వంటరిగా పిలిచారు రాజారావుగారు.

'చూడుబాబూ శంకరం! నిన్నివాళే చూశాననుకో. అయినా చనువుగా ఒక సంగతి అడుగుతున్నాను. బాలతో నువ్వు చనువుగా వుండటం చూశానిందాక...' అన్నారు.

శంకరం ఆశ్చర్యంగా ఆయన కేసి చూశాడు. 'అయితే మీకంతా తెలుసన్న మాట! అయితే వినండి. నేను బాలని పెళ్లి చేసుకోబోతున్నాను' అన్నాడు.

శంకరం కళ్ళు మెరుస్తున్నాయి అతని కళ్ళముందు ఈమధ్య జరిగిన సంఘటనలు తిరుగుతున్నాయి.

...తను సెలవులకి వచ్చి గుళ్లో పొగడ చెట్టు వెనుక కూర్చుని బొమ్మలు గీసు కుంటున్నాడు. గుళ్లో తను తప్ప ఎవరూ లేరు

అప్పుడు బాల, వాళ్లఅమ్మ గుడికి వచ్చారు దేవుడికి ఏదో నైవేద్యం పెట్టారు. తర్వాత వెళ్లిపోతున్నప్పుడు బాలతన్ని గమనించింది.

గుడిబయటకి వెళ్లి 'అమ్మా నాలుగు పొగడపూలు ఏరుకొస్తానే. నడుస్తూవుండు' అంటూ అమ్మని పంపించి వేసింది. తర్వాత మెల్లిగా తన దగ్గరకు వచ్చి ప్రసాదం చేతుల్లో పెట్టింది. తనకి ఒళ్లు పులక రించింది. తను పొగడపూలు ఏరి యిచ్చాడు. ఒడిలో పెట్టుకుంది.

ఈ బాలకా తను దూరంగావుండి పట్నంలో చదువుకుంటున్నాడు! ఈమె నేనా తను గమనించనిది అనిపించింది.

తనే సర్వస్వంగా చూసే బాల కళ్లల్లో ఆరాధనతన్ని పూర్తిగా వశపరచుకొంది. క్రమంగా బాలతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఇప్పుడు బాల లేనిదే బ్రతుకులేదు...

శంకరం కళ్ళ మెరుపులో అతనికి బాల అంటే వున్న అనురాగం గుర్తించారు రాజారావుగారు. ఆయన శరీరంలో విద్యుత్తు ప్రవహించింది.

'రెండు కుటుంబాల మధ్య వైరం సంగతి నీకు తెలుసుగా. మీవాళ్లు ఒప్పు

# పంపాడు పంపకం

కోకపోతే' అన్నారాయన సందేహం తీరక.

'ఒప్పుకోకపోయినా చేసుకుంటాను. నిశ్చయం చేసుకున్నాను కూడ ఇష్టమైన వాళ్ళు పెళ్లికివస్తారు' అన్నాడు శంకరం దృఢంగా.

రాజారావుగారికి తృప్తి కలిగింది.

'మీ నాన్నగారికి చెప్పి చూస్తాను ముందు చెప్పి చూడాలికదా.' అన్నా రాయన.

'మీ యిష్టం' అన్నాడు శంకరం

*   *   *

శంకరం పట్టుదల తెలిసిన శేషాద్రి లొంగిపోయాడు. చెల్లి పెళ్లి విషయంలో శంకరం దెబ్బలాడి యింక సెలవులకి కూడ రానని వెళ్లి పోవడం, మళ్ళా బాలకోసం రావడం, వచ్చి యింటికి రాకపోవడం వీటివలన ఆయనకి కొడుకు పట్టుదల గురించి తెలిసి వచ్చింది ఎది వచ్చిన కొడుకు దూరం అయిపోతాడంటే ఆయనకి తన పట్టుదల, మూర్ఖత్వంవల ఏమి నష్టపోతున్నదీ తెలిసి వచ్చింది ఇప్పుడు కాదంటే శంకరం యిల్లు విడిచివెళ్లి పోతాడనీ, యింక జీవితంలో కనిపించడనీ తెలుసు. అందుకే కొడుకు పెళ్లికి అంగీక రించాడు.

పైకి మాత్రం గంభీరంగా 'మావాడు అంతగా పట్టుబడితే నేను కాదనను' అన్నా డాయన.

అవిటిపిల్ల బాలవివాహం అనగానే నీల కంఠం మెత్తబడ్డాడు. 'మా బాల యిష్ట పడింది. నాకు మా శేషాద్రి మేలు చేస్తు న్నాడు. పాత విరోధం అంతా మర్చిపోదాను' అన్నాడు.

శేషాద్రి కూడ తను ఇదివరకు తొందర పాటుతో అన్న మాట గురించి పశ్చాత్తా పంతో వున్నాడు. 'నీలకంఠం నన్ను క్షమిస్తే నేను ఎప్పటిలాగే వుంటాను' అన్నాడు.

బాల శంకరంల వివాహానికి వెంటనే తాంబూలాలు పుచ్చుకున్నారు.

*   *   *

పెద్దల అంగీకారంతో, పెద్దల సమ క్షంలో పెళ్ళి గుళ్లో జరపడానికి నిశ్చ యించారు. బంధువులంతా వచ్చారు. అంతా పెళ్ళికి వచ్చిన ఆడ, మగవారితో కళ కళ లాడుతోంది.

వైభవంగా జరుగుతున్న పెళ్ళిలో స్తంభాన్నానుకుని ఒంటరిగా ఆలోచిస్తున్న రాజారావుగారికి ఇదంతా కల, వైష్ణవ మాయా అనిపించింది ఎన్ని అసంభవాలు ఒక్కసారి సంభవం కావడం చూస్తే, ఆయనకి యిదంతా ఎంతో అనిపిస్తోంది.

బాల, శంకరంల వివాహంతో తన మూడు సమస్యలూ మంచులా విడిపోతు న్నాయి

బాల, శంకరంల పెళ్ళికి అంగీకరించ డంతో నీలకంఠంగారికి శేషాద్రి నేపిన మంచి, చూపిన ఔదార్యం ఆయన పాత విరోధాన్ని మరచిపోయి స్నేహాన్ని పునరుద్ధ రించేందుకు తోడ్పడింది ఆ రకంగా వరంధామయ్యగారి సమస్య తీరుపోంది

ఈ పెళ్లివల్ల బాల మామయ్య రాజ గోపాలరావు రాణి 'చంద్రిక వదన' కావ డంలో ఆయన కొడుకుకి రాణిని బలవం తాన ఇచ్చే సమస్య, విచ్చిన్నం అయిపో యింది శేషాద్రి రాణిని తమ గోపికి యివ్వ డానికి అంగీకరించాడు ఆ రకంగా రాణి సమస్య తీరుతోంది

అన్నిటికంటే ముఖ్యం బాలని శంకరం అంగీకరించడంతో తన మామయ్య పద్మ రామకృష్ణని చేసుకోవడానికి అడ్డుగావున్న కట్నం సమస్య తీరిపోయింది

ఇన్ని సమస్యలు ఒక్క పెళ్ళితో తీరు తోంటే రాజారావుగారికి కళ్లు నీళ్ళు నిండుతున్నాయి.

వైభవంగా జరుగుతున్న పెళ్లిలో ఆయనకేమీ కన్పించడంలేదు.

వరంధామయ్యగారు, రాణి సందడిగా తిరుగుతున్నారు పెళ్ళి పందిట్లో

*   *   *

మాంగల్యధారణ జరుగుతోంది.

'ఇదంతా మా అదృష్టం మా అమ్మా యికి పెళ్ళే కాదనుకొన్నాము. శంకరం మాకు అల్లుడు కాడు. మా పాలిటి దేవుడు. మా అమ్మాయి మెళ్లో మూడు ముళ్ళు వేస్తున్నాడు' అని నీలకంఠంగారి భార్య అంటున్న మాటలు విని రాజారావు గారికి నవ్వు వచ్చింది.

తనకున్న 'చిక్కుముడి'లాంటి మూడు సమస్యలని పరిష్కరిస్తున్న శంకరాన్ని చూస్తూ 'లేదు, లేదు శంకరం మూడు ముళ్ళు విప్పుతున్నాడు' అనుకున్నారాయన ఆనందంగా,

(అయిపోయింది) ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## వ్యాసరచన పోటీ!

## 'ప్రజలూ - సినిమా'

## మొదటి బహుమతి రు. 250

## రెండవ బహుమతి రు. 200

## మూడవ బహుమతి రు. 150

**ఇంకా రు. 50 చొప్పున మూడు ప్రత్యేక బహుమతులు!**

**ముగింపు తేదీ: 3-2-1973**

భారతదేశంలో సినిమా ఒక 'కళాసాధనం'గా ప్రచారంలోకి వచ్చినప్పటినుంచీ దానిని ఈ దేశం చరిత్ర, సంస్కృతి, ఆశయాలని ప్రతిబింబించే స్వరూపాలలో నిర్మించటానికి ప్రయత్నించిన వారి సంఖ్యకి తక్కువలేదు. స్వాతంత్ర్యోద్యమానికి సినిమా పరిశ్రమ వీలయినంత చెయ్యూత ఇస్తూ వచ్చిందంటే అతిశయోక్తి కాదు. 1947 తరువాత కూడా 'పురోగమన వాదా'లని బలపరిచే చిత్రాలని కొందరు తీస్తూనే ఉన్నారు. 'అభ్యుదయభావాలు' కొరత విన్నడూలేని తెలుగుసినిమా పరిశ్రమ ఎప్పుడూ, ఎవరికీ వెనుక ఉండిపోలేదు అనవచ్చు. కొంతకాలంగా తమిళ నాడులో ఒకరకం భావాలకి ప్రచారం కల్పించే సినిమా వర్గాలవారి పలుకుబడి అత్యున్నతస్థాయిలో ఉంటున్నది. ఈ పలుకుబడి తమిళనాడు రాజకీయాలలో ఎటువంటి పరిణామాలనయినా తీసుకురాగలిగి నటువంటిది.

కొంతకాలంగా తెలుగువారి జీవితంలో తీవ్రమయిన సంచలనం ఒకటి చెలరేగింది. ఈ సంచలనం అన్నివర్గాలవారిమీదా తన ప్రభావం చూపిస్తున్నది. ఒక ప్రముఖ తెలుగు నటుడు ఈ విషయములో తన అభిప్రాయాలు స్పష్టంగా తెలిపారు. తెరమీదనేకాక తెరవెనుక కూడా దేశసేవకోసం కృషిచెయ్యటానికి వెనుదియ్యని సినిమా పరిశ్రమలోని ప్రముఖులు ఈ సందర్భంలో తెలుగువారి జీవితాలని ఆవరించిన సంచలనాన్ని ఉపశమింప చెయ్యటానికి తగిన ప్రయత్నాలు చేస్తారనివారి అభిమానులేకాక తదితరులందరూ కూడా ఆశిస్తున్నారు.

*రచయిత(త్రు)లందరూ ఉత్సాహంతో పాల్గొని ఈ 'ప్రజలూ-సినిమా' వ్యాసరచన పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.*

**నిబంధనలు**

1 స్వంత రచనలై ఉండాలి అనువాదాలు, అనుకరణలు పంపరాదు.
2 వ్యాసాలు ఒక అరఠావు (ఎక్సర్ సైజు నోట్‌బుక్ పేజీకి రెండు రెట్లు)ని మించరాదు కాగితానికి ఒకవైపునే సిరాతో రాయాలి.
3 వ్రాత ప్రతి మీద, కవరు మీద 'ఆంధ్ర సచిత్ర వార ప్రతిక వ్యాస రచన పోటీకి' అని స్పష్టంగా రాయాలి వ్యాసాలని 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, 7,తంబు చెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి' పంపాలి వ్యక్తుల పేర పంపరాదు.
4 వ్రాత ప్రతులని ఎలాంటి పరిస్థితిలోనూ తిప్పి పంపటం సాధ్యం కాదు. కాబట్టి రచయిత(త్రు)లు తమ వ్యాసాలతో పాటు స్వంత చిరునామాకల, స్టాంపులు అతికించిన కవర్లని జతపరచనవసరం లేదు.
5 పోటీ తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వార పత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపటానికి వీలు లేదు.
6 పోటీకి రచనలు 3—2—1973 లోగా మా కార్యాలయానికి చేరాలి ఆ తర్వాత అందినవి అంగీకరింపబడవు.
7 పోటీ ఫలితాలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉగాది సంచికలో ప్రచురిస్తాము



# వెండిగిన్నె

వేమకోటి సీతారామశాస్త్రి

'బాబూ! బండి తెచ్చాను. మరం కొంచెం పెందరా బయల్దేరితే సూరయ్య ఇంటికాడుండొచ్చు. లేకపోతే ఆ మాయదారోడు పొలంకు పోతాడు' అన్న దాసు కేక సున్నాలు వేయని పాత ముందుహాలులో ప్రతిధ్వనించింది. హాలు ఒక వేపుగా పగులు ఇచ్చింది వర్షం నీరుపడి చారికలు చిత్రించింది

వెండిగిన్నెలో కాఫీ తాగుతున్న బుగతగారి గుండె కరాలుమంది. పరువుపోయిన గ్రామం వెళ్ళడానికి మొహం చెల్లదు దగాచేసిన మనుషులముందు మాట్లాడడానికి మనసు లొంగదు కాని తప్పదు.

అయినా ఒకప్పుడు ఆవూరు తనది. వెయ్యిఎకరాల తన అగ్రహారం భూములు, వాటివల్లే అక్కడ సంసారాలు పచ్చదనం సంతరించుకున్నాయి. తన ఉదారత్వంవల్లనే ఎన్నో కళ్యాణాలు జరిగాయి ఒకప్పుడు తను నడిచేబాటలో అందరూ మల్లెపూలు చల్లేవారు. తను మాటాడేమాట వేదవాక్కనేవారు. చేతులెత్తి దండం పెట్టేవారు. తన అడుగులకు మడుగులొత్తేవారు

'మీరు కొంచెం కాఫీ తాగుతారా? మళ్లీ వచ్చేటప్పటికి ఎంతవేళవుతుందో' ఆ అభ్యర్థన భార్య సీతమ్మది. బుగతగారు చిరునవ్వు నవ్వారు. ఏభై ఏళ్ళ పైబడ్డ ఆయన నుదుటిమీద ముడుతలు పడ్డాయి. కాలం గాలం వేయని రథచక్రాల జాడల్లా వున్నాయా ముడుతలు.

'చాల్లే! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. అన్నట్లు చిన్నమ్మాయి ఏం చేస్తున్నాది?' అన్నారు. లోపల గుమ్మంవేపు చూడబోయి, కానీ మానుకున్నారు. వీధిగుమ్మం ఎదురుగా చేతిలో కొరడాతో దాసు ప్రత్యక్షం, నమ్మినబంటులా.

'సర్లే! నీడో చేస్తోంది. పద' అని సీతమ్మగారిచ్చిన వెండిగిన్నె సంచీలో వేసుకున్నారు.

బండి కదిలింది నాటు త్రోవలో. క్రొత్త రోడ్డు వేశారు కాబోలు, కంకరరాళ్ళు రోడ్డుమీద పరిచారు వాటి మొనలు సూదుల్లా పెరుగుతున్న ఎండలో తళతళ మెరుస్తున్నాయి. ఎద్దలగిట్టలు వాటిని తన్నుకుంటున్నాయి. రాళ్లమీద బండిచక్రాలు దొర్లుతూ కరాలు, కరాలుమని శబ్దం చేస్తున్నాయి బండి చీమకన్నా నిదానంగా నడుస్తున్నాది. కొంచెం గడ్డిమీద బండిలో వేసిన ఆ చిరిగిన తుంగచాప, బండిగతుకుల్లో పడినప్పుడల్లా జారిపోవడానికి ప్రయత్నిస్తున్నాది.

బుగతగారి జీవితంలో జ్ఞాపకాలు జారి

పోతున్నాయి. పట్టుపరుపుల్లో, మెత్తని బాలీసుల్లో, బండికదిలేది. మైసూరెడ్లు వరిగెసుతూంటే వాటి గంటలు సుమధుర సంగీతాన్ని ఇచ్చేవి. ప్రయాణ బడలిక తెలిసేదికాదు, అప్పుడు దాసుకు ముక్కుకు కమ్మి, నెవుకి కమ్మి వుండేవి. తిలారులో పిస్తులు వసూలు చేసుకుని, రైతుల కష్ట సుఖాలను విని, చేతనైనంత సహాయం చేసి, పున్నమి వెన్నెల్లో దాసు పాడిన పల్లె పదంతో పాటు బండి ఇంటి దిక్కు ప్రయాణం చేస్తూంటే ఆహా...! ఆ ఆనందం మరి తన అనుభవానికే అంకిత మయ్యేది.

కంటి ముందు సత్యవరం కనమరుగవు తోంది. బండి అడ్డుదారి దాటి రోడ్డు ఎక్కింది. ఆ మలుపులో ఊరి ముందు పొదాలమ్మ గుడి మరి కన్పించలేదు. ఏపుగా పెరిగి ఎండిపోయిన తన పెరట్లో కొబ్బరి చెట్లు మాత్రం కన్పిస్తున్నాయి.

'టీ తాగుతావా దాసూ!'

'ఒద్దు బాబూ, పొద్దున్నే సల్లంది లిన్నాను' బండి క్రొత్త బస్టాండ్ దాటి పోయింది. క్రొత్తగా మరమ్మతులు చేసి, సున్నం వేసిన టౌన్‌హాల్ మధ్య పచ్చ గడ్డిలో కెంపులు పరచినట్లుగా ఉండే టెన్నిస్‌కోర్టు దాటిపోయింది ఆ రోజుల్లో టెన్నిస్ రాకెట్టు పట్టుకుని రాలీసైకిల్ మీద వచ్చి ఆగే నాడుతను.

'నీ ఏడం చేతి ముక్కుకు మరి తిరుగు లేదోయ్, ఎమర్సన్ పెన్ను నీ చేతిలో వుంది' అనేవాళ్లు మిత్రులు. బుగత ఒళ్లుగగు ర్పొడిచింది. నరసన్నపేట జీడి తోటలు, తిలారు అడ్డురోడ్డు మలుపు దాటి పోయింది బండి. ప్రకృతి కనుచూపుమేర బంగారంలా వుంది. గర్భిణీ స్త్రీలలా వరి వెన్నులు భారంగా వంగిపోయాయి. ఆకాశం అంతా నీలంగా, నిర్మలంగా వుంది, త్వరగా దిగిపి వస్తున్న భాస్కరుని కాహ్వానమిస్తూ. ఉన్నట్లుండి ఎద్దు బండిని ప్రక్కకు లాగే శాయి. బస్సు హారన్ రాక్షసిలా అరచింది.

'ఏహేహె! ఏందయ్యా డ్రైవరూ సూపు సనుంగా సేదేటి? గొడ్లు బెదిరి ప్రక్కకు వాగేసినాయి' అని దాసు కాడి మీద నుండి క్రిందకు చటాలున ఉరికాడు బస్సుకా మాటలు వినిపించనట్లే నాగి నుంజి విడి విన బాణంలా సాగిపోయింది.

'దాసూ! ఎడ్లను ఎండగట్టేశావేమి టోయ్? డొక్కలు కన్పిస్తున్నాయి' అన్నారు బుగత నవ్వాడు దాసు నిర్జీవంగా

'మీగ్గెల్లబాబూ! మనుసు డొక్కలే ఎండిపోతున్నాయి ఏనాటి ఋణానబందమో వీటికీ నాకూ' అన్నాడు దాసు ఎడ్లను అదలిస్తూ.

తిలారు కనుచూపు మేరలో వుంది. రోడ్డుప్రక్కన తాటితోటలు, ప్రక్కన సీతాంబాలి కిర్రుకిర్రుమంటోంది. ప్రక్కగా గొడ్లను మేపుతున్న పశువులకాపరి పిల్లన గ్రోవి వాయిస్తున్నాడు బొర్రెలో నీరు ముత్యాలవాగులా మెరుస్తున్న ఎండలో పారు తోంది జలజలా,

'దాసూ బండి ఆపవోయ్ దాహం వేస్తోంది' అన్నారు బుగత. బండి ఆగి పోయింది. దాసు వెండి గిన్నెడు నీళ్ళు తెచ్చి అందిచ్చాడు భక్తితో.

'హన్నుమయ్యా! ఇప్పటికి ప్రాణం తెప్ప రిల్లిందోయ్ ఏమిటో సంక్రాంతిరాకుండా నే వేసంగి వచ్చేసినట్టుంది. ఏమిటో కలి కాలం' అన్నారాయన అవునన్నట్లు, తలూ పాడు దాసు. వెండిగిన్నెను శుభ్రంగా తుడిచి, సంచిలో పెట్టబోయారు. ఆ జీర్ణ లోహంలో తన మూర్తి అస్తవ్యస్తంగా కన్పించింది.

'అవును! బుగతగారి బ్రతుకంతా అస్త వ్యస్తమైపోయింది వెయ్యెకరాల ఆసామీగారి, చేతికి ఎముకలేని దాతృత్వం, మరుగుల్లో మానవత్వానికి విలువనిచ్చే మనస్సు కోపం, కార్పణ్యం మింగేసిన కారుణ్యం, మనిషిమీద నమ్మకం ఇవన్నీ ఆనాటి జీవితాన్ని భగ్నం చేసాయి. రైతులు అగ్రహారం భూములు స్వాధీనం చేసుకున్న రోజున.

'మీరేం భయపడకండి బుగతగారూ! ఒక్క దావావేయండి వాళ్లూ చచ్చినట్లు మీకాళ్ళకు మ్రొక్కి మరీ లొంగుతారు' అని సలహా ఇచ్చాడు కరణం, జేబులో పెన్ను చేతిలోకి తీసుకుంటూ. తను తట పటాయించాడు.

'మీరు జమీందారులా బ్రతికేరింతవరకూ. ఇంకా మీకు పిల్లలువున్నారు, వాళ్ళూ మీ అంత హోదాగా జీవించాలి. మనకేం జీవితంలో సగభాగం గడిచేపోయింది' అని మరోసారి హెచ్చరికచేశాడు కరణంయుకి గా

అపుడే ఆటనుండివచ్చారు కాబోలు తన పెద్ద కొడుకు రవి, చిన్నవాడు క్రిష్ణ, వాడి తర్వాత ఆడపిల్లలు కామేశ్వరి, విజయా ఇంట్లోకి వెళుతున్నారు సాయం సంధ్య ఆవరించిన ఇంట్లో దీపం వెలిగించలేదు దరిద్రానికి ప్రతిరూపంగా చీకటి అలుము కుంటున్నాది

తనలో ఆవేశం, ఉత్సాహం క్రమంగా పుంజుకుంటున్నాయి. అంధకారం కాబో తున్న భవిష్యత్తును ఛేదించాలనుకున్నాడు. అవును తన బిడ్డలకు పెద్ద చదువులు చదివించాలి కొడుకుల్లో ఒకడు డాక్టరు, మరొకడు ఇంజనీరు కావాలి, తనకు కలె క్టరూ, పోలీస్ సూపరింటెండెంట్ అల్లుళ్ళు కావాలి తన పిల్లలు బంగారు బొమ్మలు అనుకున్నాడు.

కోర్టెక్కినవాడు, కల్లు త్రాగినవాడు— సామెతలాగే అయ్యింది తన బ్రతుకు. సమస్యా పరిష్కారం కాకపోగా భార్య ఒంటి మీద నగా, నట్రా, జమీందారీ లాంటి ఎన్నారీ అంతా కాలం పెరిగించిన కర్పూ రంలా కాలిపోయింది.

చివరకు తనకు మిగిలిందేమిటి? దుర్భర దారిద్ర్యం. ఎదుగుతున్న పిల్లల కోరికలు, గత వైభవాన్ని గుర్తుకు తెచ్చే స్మృతులు, తన తల్లి చేతో గోరుముద్దలు కలిపి, తిని పెంచిన పెద్ద వెండిగిన్నె, ఇవన్నీ అతని మనస్సును కలవరపరచ సాగాయి.

వెండి గిన్నెలోకి చూశారు బుగతగారు. కన్నీటి తెరల మధ్య తన మూర్తి కన్పించ లేదు. మాసిపోయిన జరీకండువాతో కళ్లు తుడుచుకున్నారు

'ఏమిటండీ మరీ చిన్నపిల్లాడిలా వెండి గిన్నెలోనే అన్నం తింటారు, గాంట్లోనే కాఫీ తాగుతారు' అంది తన భార్య సీతమ్మ పెళ్ళయిన క్రొత్తలో

'నిజమే సీతా! చిన్నప్పటి నుంచి ఇందు లోనే తినటం, త్రాగటం అలవాటయి పోయింది. అలా చెయ్యకపోతే ఏదో మన స్సులో వెలితిగా వుంటుంది, అసలు భోజనం చేసానన్న తృప్తి వుండదూ, కడుపూ నిండదు.' అనేవాడు తను ఆమె బుగ్గల మీద చిటిక వేసి ఆమె చెక్కిళ్ళు ఎరుపుదనంలో తన ప్రతిబింబం తృప్తిగా చూసుకుంటూ. అవౌక [illegible]

బండాగిపోయింది. బుగతగారు గతం లోంచి మళ్ళారు.

"బాబూ! రైలుబండి వస్తోంది. గేటు వేశారు. కాసింత చుట్టముక్క వెలిగించుకొస్తా' నంటూ దాసు బండి దిగాడు; దూరంగా రైలింజను కూత వేస్తోంది అటోతు వేసిన ఠంకెలా రాక్షసి బొగ్గుల్లో రగిలిన అగ్నిజ్వాల నల్లమేఘాల్ని గాలిలోకి వదిలేస్తున్నాది. రైలు స్టేషనులో ఆగుతుంది. కొంతమంది ప్రయాణీకులు దిగుతారు. మరికొంతమంది ఎక్కుతారు మళ్ళీ రైలు కదులుతుంది. ఆ ఆలోచనలు రైలుపెట్టె బుగతగారికి మస్తిష్కంలో కదిలింది.

'నాన్నా నేను స్కూలుఫైనల్ ప్యాసయ్యాను. ఇంటరు చదువుతాను నాన్నా' అన్నాడు పెద్దకొడుకు. అప్పటికే పరిస్థితులు తారుమారయ్యాయి. తన తండ్రి ముద్దుచేసి, ఐదవక్లాసు, కొంచెం సంస్కృతం చెప్పించి తరువాత మరి చదివించలేదు.

'లేదు బాబూ! నేను మరి చదివించలేను. నువ్వు ఏదైనా ఉద్యోగం చెయ్యడానికి ప్రయత్నం చెయ్యి' అన్నాడు తను

తనకు తెలిసిన కాస్త పలుకుబడితో అతనికి తాలూకాఫీసులో గుమాస్తా ఉద్యోగం, స్కూలుఫైనల్ తప్పిన రెండోవాడు కృష్ణకు హైస్కూల్లో ఏటెండరు ఉద్యోగం ఇప్పించారు. రెయిలుచక్రాల లయబద్ధమైన శబ్దం దగ్గర కావస్తోంది. రైలు నెమ్మదిగా స్టేషనువైపు పరుగిడుతోంది.

అప్పుడు తిలారు రైలుస్టేషనులో నాలుగు కార్లలో పెళ్ళివాళ్ళని ఎదుర్కొని, తీసుకువచ్చాడు తను. పెళ్ళికొడుకు సెంట్రల్ గవర్నమెంటులో ఉద్యోగం. కామేశ్వరికి తగిన ఈడూ, జోడూ అన్నారు. వివాహం వైభవంగా జరిపించాడు తను. కానీ శోభనంనాటి రాత్రి అల్లుడు స్కూటర్ కావాలని అలకపాన్పు ఎక్కాడు. తర్వాత ఏదో ఇస్తామని బ్రతిమాలి కార్యం గట్టెక్కించారు పెద్దమనుషులు, మధ్యవర్తులు. చిన్నకూతురుదగ్గరకు వచ్చేసరికి అమాత్రం సుసంగా కూడా చెయులేక పోయాడు. ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటులో పనిచేస్తున్న బిల్లు కలెక్టరుకిచ్చాడు. రైలు గేటు తెరిచారు. బండి కదిలింది బుగతగారి ఆలోచనలతోపాటు ఊరి మొదట్లో బండి మలుపు తిరగకముందే

# వెండిగిన్నె

'ఒరేయ్! వెంకన్నా, సూరయ్య ఏడ ఉన్నాడ్రా?' రోడ్డుప్రక్కనున్న మనిషి నుద్దేశించి అడిగాడు దాసు.

'కళ్ళంలో వున్నాడ్రా' అన్నాడా మనిషి పొలంలోకి దిగుతూ.

బండి ఊరి మలుపుతిరగకుండానే కళ్ళం ముందు ఆగిపోయింది. పొలంలో బంగారం కుప్పలు పోసినట్లుగా వరికుప్పలు. సూరయ్య బల్లమీద కూర్చున్నాడు చుట్టకాలుస్తూ, పాలేళ్ళకు పనులు పురమాయిస్తున్నాడు.

బుగతగారు మెల్లగా బండిదిగి నడుచుకుని సూరయ్యదగ్గరకు వచ్చారు.

'దండాలు బుగతగోరు' అన్నాడు సూరయ్య లేవకుండానే, చుట్ట నోట్లోంచి తియ్యకుండానే యెటో చూస్తూ. తను రాగానే కళ్ళంలో పట్టు

## విడిపోదాం!

ఎందుకీ తగాదాలు — తల నొప్పులు
ఎందుకీ విభేదాలు — వింత భాష్యాలు
ముల్కీ
మీకు తేనె లొలుకు
మాకు గుండెల్లో ములుకు
మీ ఆదాయం మాకు తెలుసు
మా సంపద మీకు తెలుసు
యెవరు యెవర్ని దోపిడీ చేసింది
లెఖ్ఖలు రాసిన టుక్కరులకు తెలుసు
ఒకరి పదవీవ్యామోహం కావాలంటోంది
సమైక్యత
మరొకరి పదవీకాంక్ష కావాలంటోంది
అనైక్యత
దేశంలో అందరికే సమానహక్కు లున్నాయి
పాపం! ఆంధ్రులకు మాత్రం అవి దక్కకున్నాయి
మీకంటల్లో మేం వేలు పెడతాం
మా నోట్లో మీరు వేలుపెట్టండంటం మీ హక్కు కాదంటే
మీ సంస్కృతీ — సభ్యతలను రంగరించి
గోడలమీద కవితాక్షరాలు నగ్నంగా
చిత్రించడం మీ హక్కు
గిట్టనిచేతే ఇడిపోదాం ఎర్మిషన్నా
మా కొద్దీ చిక్కుముళ్ళు

—నిమ్మగడ్డ రామ్‌ప్రసాద్

భోగరాజు కోదండరామశర్మ

వెరువులు, బాలీసులుతీసి, అగుగులకు మడుగులొత్తుతూ, వెండిగిన్నె నిండా నేతి కొబ్బరికాయ నింపించిపెట్టే ఆ సూరయ్య కాడినాడు. తనకు మిగిలిపోయిన దేదైనా రాలు జిరాయితీ దున్నే ఆనాటి రైతుకాడి సూరయ్య, ఇప్పుడు పెద్ద భూకామందు సూరయ్య.

'నేనే మీకు కబురు పంపిద్దామనుకుంటున్నాను' అన్నాడు సూరయ్య ఆకాశం వేపు చూస్తూ.

'ఏకెందుకులేరా! నేనే వస్తే కాను ఏదో శ్రమపడి' అన్నాడు బుగత.

'అదికాదు బుగతగోరూ! డబ్బు నాదగ్గర లేదు. పంటలా పోయినాయి. ఇప్పట్లో మీకు సర్దుబాటు అవదు' అన్నాడు.

బుగతగారి గుండెల్లో రాయిపడింది. ఎకరా విసిరిదివేలకు తక్కువచెయ్యని రెండెకరాలు మూడువేల చొప్పునా అమ్మడానికి ఏగ్రిమెంటు రాసుకుని అందులో రైతు భాగంగా సూరయ్య ఒక ఎకరా తీసుకుని, మిగతా మూడువేలకు రెండొందలు అడ్వాన్సుగా చేతిలో పెట్టాడు సూరయ్య ఆరు మాసాల క్రిందట.

'అలా అనకు సూరయ్యా! నా పరిస్థితి నీకు తెలియనిదికాదు. చిన్నమ్మాయి పెళ్ళిలో కట్నంకు బదులుగా రాసిన ప్రోనోటుమీద డబ్బులు చెల్లిస్తేగాని తన యింటికి రావద్దని, వాతలువేసేటట్లు కొట్టి మాయింటికి గెంటేశారు. ఆ అమ్మాయి కాపురం కుదుటపడాలి. బాబ్బాబు, నీకూతురనుకుని దాని కాపురం నిలపెడుదూ' అన్నారు దీనంగా బుగత సూరయ్య ముఖంలో విసుగుదనం కన్పించింది.

'చెప్పాను కదండి! ఈ సంవత్సరం మరేమీ చెయ్యలేను వచ్చే సంవత్సరం చూద్దాంలెండి' అన్నాడు సూరయ్య ఈ ఆర్నెల్లకాలంలోనూ ఏ మున్నూటపార్లో వచ్చారు బుగత. కానీ చివరకు ప్రయోజనం లేకపోయింది. ఆయన కళ్ళలో నీటి తెర సూరయ్యరూపాన్ని అస్పష్టంగా చిత్రించింది. ప్రోత దాసుముఖం కోపంతో జేపురించింది. ఎడ్లనుతోలిన కొరడా అతని చేతిలో కోపంతో బిగుసుకుంది.

'సూరయ్యా! మరోసారి ఆలోచించు. నీవూ పిల్లలుగల వాడివి. కనీసం అయిదు వందలయినా సర్దు. దాన్నెలాగయినా




# లక్స్ సుప్రీమ్

## బ్యూటీ క్రీమ్ కూడ కలిగినది.

లక్స్ సుప్రీమ్ మీ ముఖ చర్మము పట్టువలె మృదువుగా, అందముగా ఉండుటకు అపూర్వమైన క్రొత్త సబ్బు. దానిలో మాత్రమే బ్యూటీ క్రీమ్ కూడ ఉంది.

పుష్కలముగా వచ్చే దాని నురుగులో బ్యూటీ క్రీమ్ ఉన్న అనుభవము మీకు నిజంగా కలుగుతుంది.

లక్స్ సుప్రీమ్‌యొక్క నురుగు మీ ముఖమునకు మెరుగుదిద్దుతూంటే, దాని క్రొత్త సువాసనతో మీరు వెలుగొందుతారు.

**లక్స్ సుప్రీమ్‌తో మీ అందమునకు రాణింపు చేకూర్చుకోండి.**
**బ్యూటీ క్రీమ్‌గల ఏకైక సబ్బు యిదే.**

బెంగుళూరు, హైదరాబాదు, సికిందరాబాదులలో లభిస్తోంది.

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఒక నాణ్యమైన తయారు.

త్తవారింటికే.....

'ఏ దీ పా ర్ధా నావెత లేదనిపించకండి బుగతగారు. ఒరేయ్ ఆ దిగువ చేనికోత ప్రారంభించండిరా' అని అక్కడి నుంచి లేచి పోయాడు. దాసు వాడిని అనుసరిం చాడు

'పోనీ సర్దుబాటు చెయ్యకపోతే సరిగానీ నూరయ్యన్నా మగతా ఎప్పుడు కొలు స్తావు? ఆళ్లింటి కాడ గంజినీళ్ళకిబ్బంది ఐపోతన్నారు. నువ్వా అలాగంటే ఎలాగ? ఏదో ఇదంగా సర్దుబాటు సెయ్యి. నువ్వు ఇస్తావని ఆశతో నీకాడకొచ్చారు. నువ్వు ఇవ్వవలసింది కాబట్టి అడుగుతున్నారు' అన్నాడు దాసు. నూరయ్య రివ్వున వెనక్కు తిరిగి,

'ఏందిరా దాసూ! నువ్వనేది? ఈ సంవ త్సరం పండిందంతా శిస్తుకీ ఎరువులకూ వస్తుందో రాదో బుగతగారికేటి కొలుస్తాను? అదీగాక నేను ఆయనగారి భూమికొన్నట్టే కదా?' అన్నాడంతో చుట్టుముట్టిన స్వార్థం నాగుపాము కాటు తిన్న మనిషికి ఎవరు త్రాగిస్తారు నీతి, నిజాయి తీల్లాంటి అమృతబిందువులు? ఎలా వుంటా యవి? ఎవరు పోస్తారు కారుణ్యంతో నిండిన మానవత్వం అతని జీవితంలో?

ఆ విషయంలో దాసుకు చాలా కోపం వచ్చింది. నూరయ్యను దాసు చిత్రవధ చేద్దామనుకున్నాడు. కానీ ఏం లాభం?

# వెండిగిన్నె

న్యాయం ప్రక్కన మాట్లాడే వాడు ఆ సమయంలో అతను ఒక్కడే మిగిలాడు. కోపాన్ని దిగమ్రింగుకున్నాడు దాసు బల హీనంగా

బండి తిరుగుముఖం పట్టి కదిలి పోయింది. రోడ్డు కిరుప్రక్కల బంగారం పండే భూములు, మధ్య పంటకాలువ ఒకప్పుడు తన భూములు. ఇనాం దారీ చట్టంలో అన్నీ చాలా వరకూ నూరయ్య వశమై పోయినాయి అవన్నీ కదులుతున్న బండితోపాటు కనుమరుగవుతున్నాయి

కొలిమిలో సమ్మెట పోటులా లయ తప్పకుండా క్రమంగా కొట్టుకుంటోంది బుగతగారి గుండె, వేదనతో.

భగవంతుడులేడు బాబూ! ఆ నూరయ్య గాడికి తగిన శాస్తి చేస్తాడు బాబూ! అలు డుకి బలుడయితే, బలుడుకి బ్రహ్మదేవుడు కొడతాడని మీరేకదా చెప్పింది.' దాసు ఉపశ మన వాక్యాలతో గొంతు చిక్కుపడిన జీర కంపించింది.

'న్యాయం... ధర్మం.. భగవంతుడు .' నవ్వుకున్నారు బుగతగారు ఎదు రుగా మర్రిచెట్టు మీది గువ్వపిట్ట పిల్లలకు ఆహారమిస్తోంది పిల్లలకు కొంత కాలంపోతే రెక్కలు వస్తాయి. ఎగిరిపోయి స్వతంత్రంగా జీవిస్తాయి అప్పుడు అవి

తల్లినే మరచిపోయి, ధిక్కరిస్తాయి.

తన జీవితంలోకూడా అంతే అయ్యింది. ఏదోఉన్న ఊరిదగ్గరగా ఉద్యోగం, ఇద్దరి కొడుకుల జీతంతో వాళ్ల నీడనే శేష జీవి తాన్ని నిశ్చింతగా గడపవచ్చనుకున్నాడు. కానీ ఇప్పుడు కొడుకు లిద్దరూ భార్యల మాటలు విని వేరే ఊళ్ళోకి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నారు, ఇంట్లో మిగిలిన సామా నులు పంచుకుని.

'పట్నం కాపురం చాలా కష్టం నాన్న గారూ! మిగిలితే ఏదైనా నెలకు పంపి స్తాను' అన్నాడు పెద్దవాడు చిన్నవాడు కూడా అదేమాట అన్నాడు అప్పటికే అను క్షణం దరిద్రంచే తరుమబడి శిథిలమై పోతున్నాడు తను శిథిలమైపోతున్న తనకి, తన భార్యకి కొంత ఆశ్రయం కొడుకుల దగ్గర దొరుకుతుందని ఆశలగూడు అల్లు కున్నాడు తను. కానీ దరిద్రం కాలసర్పం తన జీవితాన్ని వదలలేదు ఆశలగూడు విశ్రాంతి జీవితానికి నాంది గీతం పాడలేక పోయింది

బండి శిదిలమై, పడిపోవడానికి సిద్ధంగా వున్న శిథిలించిపోయిన మేడముంది ఆగింది. భార్య సీతమ్మ మాసికలచీర భుజాల నిండుగా కప్పుకుని,

'నెమ్మదిగా దిగండి' ఆమె కంఠంలో ఆవేదన

'వస్తాను బాబూ!' అంటూ దాసు బండి తిప్పాడు.

'దాసూ! నీకు బండి అద్దె చాలా ఇవ్వాలి ఏదైనా చూసి సర్దుబాటు చేస్తాను' అన్నారాయన గాద్గదిక కంఠంతో.

'అలాగే బాబూ' అన్నాడు దాసు. చిన్నప్పుడు ఇద్దరూ ఒకేబళ్లో చదువు కున్నారు

ఆకలి శోష వచ్చినట్లయ్యింది బుగత గారికి

'సీతా ఈపూట ఏం చేసావు?' అన్నారు బుగత

'ఎక్కడా బియ్యం దొరకలేదండీ! సోమటికొట్లో ఇప్పటికే వందరూపాయ లైంది, ఇక ఇవ్వనన్నాడండి, అప్పుడు దాసు భార్యదగ్గరకు పంపిస్తే...' ఆమె కంఠం రుద్ధమైంది.

'ఆ! దాసు భార్యాదగ్గరకు పంపిస్తే ఏం జరిగిందేమిటి?' అన్నారాయన ఆతృతగా. (

ఇదుగో నువ్వు కొస్త నోర్మూసుకో! నీ మాటల్ని నిజమే మాట్లాడితే — నేను డబ్బు సంపాదించేదెలా!



'ఏంలేదు. చోడిపిండి ఇచ్చింది. జావ చేసాను' అందామె. ఆయన పెదాలమీద చిరునవ్వు వెలసింది. దాసు పెళ్లి తను చేయించాడు

'ఇంతేనా సీతా! వెండిగిన్నెలో పోయి' అన్నా రాయన కోడు విరిగిన కుర్చీలో కూర్చుంటూ.

వెండిగిన్నెనిండా చోడిజావ పోసింది సీతమ్మ.

'సీతా! కాలం ఎంత విపరీతమైందో చూశావా? చిన్నప్పటినుండి ఈ వెండి గిన్నెలోనే తిన్నాను, తింటున్నాను ఒకప్పుడు ఇగులో పంచభక్ష్య పరమాన్నాలు, షడ్రసోపేతభక్ష్యాలూ, పెరుగూ అన్నంతిన్నాను పానకం త్రాగాను. చెరకురసం త్రాగాను పంచామృతాలు సేవించాను ఈనాడు ఈ వెండి గిన్నెలోనే చోడజావ త్రాగుతున్నాను అయినా నాకు తృప్తిగానేవుంది' అన్నా రాయన.

సీతమ్మ కళ్ళు చెమర్చాయి.

'నాన్నగారూ! అన్నయ్యా దిద్దరూ, అక్కయ్య ఉత్తరాలురాశారు' అంది చిన్న కూతురు విజయ ఉత్తరాలు చేతికిస్తూ.

'ఉత్తరంలో సారాంశం ఏమిటో చెప్పమ్మా చాలు.'

'ఏంలేదు నాన్నగారూ! మీరు ఏదో భూమి అమ్ముతున్నారని, అందులో తమ డబ్బు భాగాలు ఇచ్చే ఏర్పాట్లు చేస్తానే క్రయ చీటీ మీద సంతకంపెట్టకూడదని రాశారండీ' అంది విజయ. బుగతగారు నవ్వుకున్నారు

'అక్కయ్య ఏం రాసిందమ్మా?'

'బ్రహ్మశ్రీ వేదమూర్తులైన నాన్న గారికి మీ కుమార్తె కామేశ్వరి నమస్కారములు. ఉభయకుశలోపరి, ఇచ్చట నన్ను అత్తగారు చిత్రహింసలుచేస్తున్నారు పెళ్లినాటి స్కూటరు డబ్బు ఇవ్వలేదని ఆయన నానామాటలంటున్నారు మీరేదో భూమి అమ్ముతున్నారని పెద్దన్నయ్య రాశాడు 'నీవు కూడా క్రయ చీటీమీద సంతకం పెట్టవలసి వుంటుంది అందుకని సంతకంపెట్టేటప్పుడు స్కూటర్ డబ్బు నాలుగువేలు పట్టి ఒక వెయ్యి తీసుకురా' అని మీ అల్లుడుగారు అన్నారు. ఆ పని పూర్తిచేసుకుని [illegible] రమ్మన్నారు కాబట్టి రేపు నేను బయలు దేరివస్తున్నాను దాసు బండి తోలుకుని స్టేషనుకు పంపించండి మీ కుమారుడు క్షేమం మీ ఆరోగ్యం జాగ్రత్త. అమ్మకు నా నమ

# వెండిగిన్నె

స్కారములు. ఇంతే సంగతులు. చిత్తగించవలెను.

ఇట్లు,
మీ కుమార్తె,
''కామేశ్వరి,''

'భగవాన్' అంటూ నిట్టూర్చారు విజయ చదివిన ఉత్తరం విని బుగత.

* * *

ఆరోజు ఉదయం ఏడుగంటలయినా, సూర్యాస్తమయ సమయంలావుందా వాతావరణం నింగిని నల్లమేఘాలు కౌగిలించుకుంటున్నాయి. చల్లగాలి రివటలులేస్తూ, చిన్నజల్లు ప్రారంభమయ్యింది. జమీందారీ హోదాను ప్రతిబింబింపజేసే సువిశాలమైన విరిగిపోయిన కిటికీల్లోంచి గాలి శరీరాన్ని సూదుల్లా పొడుస్తోంది.

వారం రోజుల క్రితం జరిగిన సంఘటనలు అలా సినిమా రీలులా మంచం కంటుకు పోయిన బుగతగారి మస్తిష్కంలో దొర్లుతున్నాయి. ఆ మర్నాడుదయమే జ్వరం వచ్చింది. ఆ సాయంకాలానికి ఎడం కాలూ, ఎడం చేయీ పడిపోయాయి. దాసు భోరున ఏడ్చాడు. ఊళ్లో వాళ్లందరూ ఏదో సాయం చేసారు. దాసు సూరయ్య దగ్గరకు వెళ్ళితే వాడు హైదరాబాదు వెళ్ళాడని తెలిసింది. కొడుకులిద్దరికీ ఉత్తరాలు రాశారు కానీ రాలేదు. ఊళ్లో డాక్టరు ప్రాక్టీసు ప్రారంభించిన మాష్టారు మందులు, ఇంజక్షన్లు ఇస్తున్నాడు. పెద్దపిల్లా, మనుమడూ వచ్చేశారు.

శరీరం మీద ఈగలు వాలకుండా తన సహధర్మచారిణి సీతమ్మ విసనకర్రతో విసురుతూ కూర్చుంది. తనని చూస్తున్న ఆమె కళ్ళల్లోకి దీనంగా చూస్తూ,

'ఎందుకు విచారిస్తావు సీతా? మా నాన్న చిన్నప్పుడు ఒక శ్లోకం చదివేవాడు నాకిప్పటికీ జ్ఞాపకం, అదేమిటో తెలుసా

'బాలస్తావత్ క్రీడా సక్తః
తరుణ స్తావత్ తరుణీసక్తః
వృద్ధ స్తావత్ చింతా సక్తః'

.........

మనకు జీవితంలో భగవంతుడిచ్చిన బహుమతి ఇదే' అన్నారాయన. సీతమ్మ హృదయంలో దుఃఖం పెల్లుబికింది పాతాళగంగలా.

'నాన్నగారూ! జావ త్రాగండి' పెద్దకూతురు నూకలజావ వెండిగిన్నెతో తెచ్చి ఇచ్చింది.

'అంత తాగలేనమ్మా కొంచెం తీసేయ్' అలాగే చేసింది కామేశ్వరి.

'మీకు మరీ చాలా అన్యాయం చేసానమ్మా' అన్నారాయన

'మీరు అధైర్యపడకండి నాన్నగారూ! మీరు త్వరలో కోలుకుంటారు' అంది కామేశ్వరి ముఖం ప్రక్కకు తిప్పుకుని, వచ్చిన దుఃఖం ఆపుకుంటూ. బుగతగారు దిండుక్రింది ఉత్తరం తీశారు.

'విజయా' అని పిలిచారు బుగత విజయ వచ్చింది ఆమె కళ్లు వాచివున్నాయి. ఏడ్చింది కాబోలు.

'రేపు కదమ్మా మీ ఆయన పెట్టిన గడువులో ఆఖరిరోజు.'

'ఇప్పుడవేం పెట్టుకోకండి నాన్నగారూ! ముందు మీ ఆరోగ్యం బాగుపడాలి' అంది విజయ ఆర్ద్రంగా.

'అది కాదమ్మా! మీ ఆయన పెట్టిన గడువులో ఐదువందలు తేకపోతే నిన్ను వదిలేస్తానన్నాడా? మన వంశమేమిటి? మనహోదా ఏమిటి? నిన్ను నేను ఇంట్లో పెట్టుకు డబ్బు ఆర్జిస్తున్నానంటాడా? నన్ను ఏమన్నా ఒప్పుకుంటానుగానీ లక్ష్మీదేవిలాంటి నా కూతుర్ని ఆడిపోసుకుంటే నాకు మనస్సెలా ఉండబడుతుందమ్మా!' బుగతగారి ముఖం కోపంతో జేవురించింది. కోపంతో కుడిభాగం వణికిపోయింది మాట వంకరొచ్చింది.

'మీరు ఆవేశపడకండి అసలే వంట్లో బాగులేదు' అంది సీతమ్మ.

'ఏం ఫరవాలేదు సీతా! అమ్మాయిని తక్షణం అత్తవారింటికి ప్రయాణం చేయించు' అన్నాడాయన.

'మరి...' మాట్లాడబోయింది సీతమ్మ.

'మాట్లాడకు సీతా, దాసూ! బండీ తీసుకురావోయ్.'

'అదికాదు నాన్నగారూ— మీరు ఇలాగుంటే...'

'ఏం ఫరవాలేదమ్మా! మీకున్న ఈ ఉదారాభిమానాలు ఆ కొడుకులకు లేకపోయాయి' అన్నారాయన అభిమానంగా.

మూడునిమిషాలో దాసుబండి వచ్చింది.

దాసు గుమ్మంలో చేతులు కట్టుకుని నిలబడ్డాడు. చిన్న నంచీతో, మాసికలువేసిన చీరతో, స్వర్ణప్రతిమలా, [illegible] వాడిపోయిన విజయను దగ్గరకు పిలిచి ఆప్యాయంగా తల నిమిరాడు చేతిలో వెండి గిన్నె పెట్టారు. విజయ నిశ్చేష్టురాలైంది.

'దాసూ'

'ఏం బాబూ'

'అమ్మాయికిచ్చిన వెండిగిన్నె నూరు తులాలు వుంటుంది. దాన్ని పేటలో అమ్మేసి, అమ్మాయికి అయిదువందలిచ్చి, విజయనగరం బస్సెక్కించు. మిగిలిన సగంలో సగం నీబండిఅద్దె తీసుకో.'

'బాబూ! పైన మేఘం లేచింది ఈ ఇల్లు [illegible] పెద్ద వర్షం పడుతుంది.'

'ఇంకా వర్షం పెద్దదికాలేదు కద దాసూ! మరేం మాట్లాడకు. చిన్నతనం నుండి ఇప్పటివరకూ ఈ వెండిగిన్నెలోనే తిన్నాను, తాగాను ఇప్పుడు. ఇప్పుడు దాని కాపురంకన్నా నా వెండిగిన్నె ముఖ్యంకాదు. అయినా మనిషికి ముఖ్యమైనది సంపద కాదమ్మా—మానవత్వం. అమ్మా! విజయా! త్వరగా బండెక్కు చీకటైపోతోంది!'

'నేను వెళ్లొస్తాను నాన్నగారూ! మీ ఆరోగ్యం జాగ్రత్త' అంది విజయ కన్నీళ్ళతో నిండిన కళ్ళు తుడుచుకుంటూ.

'అలాగేలే తల్లీ!— అమ్మా! కామేశ్వరీ కొంచెం మంచినీళ్ళు తీసుకురామ్మా!' కామేశ్వరి నీళ్ళకొరకు లోపలకు వెళ్ళింది.

చివరిసారిగా వెనక్కు తిరిగి తండ్రి పాదాలకూ, తల్లి పాదాలకూ నమస్కారం పెట్టి, విజయ బండిలో ముందు కూర్చుంది, తల్లి చెప్పిన జాగ్రత్తలు వింటూ.

దాసు [illegible] వదల్చాడు. బండి [illegible] పరుగెడుతున్నది. సీతమ్మగారు గట్టిగా నిట్టూర్చారు కదులుతున్న బండి చూస్తూ.

'ఇదిగో నాన్నా మంచినీళ్ళు' కామేశ్వరి మాట బుగతగారు వినలేదు. కళ్ళు విప్పివున్న ఆయన కదిపినా కదలలేదు.

'నాన్నగారూ' అని గట్టిగా కేకవేసింది కామేశ్వరి వెర్రిగా. కేక విన్న సీతమ్మగారు లోపలకు పరుగెత్తింది.

'ఏమండీ మా కన్యాయం చేసిపోయారా!!!' అన్న తల్లి ఏడుపు విని విజయ కదులుతున్న బండి దిగిపోయింది. బుగతగారి బ్రతుకు జీవితపు చివరిఘట్టాలనూ, దాటిపోయింది.

అతని చేతులు నిశ్చింతగా గుండెలమీద వున్నాయి. అతని ముఖం తృప్తిగా, నిండుగా వుంది. బండిలోవున్న చిరిగిన తుంగచాప మీది వెండిగిన్నె క్రిందకు జారిపోయి, కదులుతున్న బండి క్రిందపడి, చితికి, ఛిద్రమైపోయింది.

# కొన్ని సామాన్య వ్యాధులకు పథ్యాపథ్యములు

## దంతసంబంధమగు రోగములు గలవారికి పథ్యాపథ్యములు

చిగుళ్ళవాపు, నొప్పి, చిగుళ్ళవెంట పళ్ళు చీము రక్తము, దంత వ్రణము మొదలగు దంత సంబంధమైన రోగములు గల వారికి ఈ క్రింది సామాన్య పథ్యాపథ్యములు.

**పథ్యములు.—**

మంచి పాతబియ్యంపుఅన్నం, గోధుమ అన్నం, గోధుమరొట్టెలు తినవచ్చును పాలు త్రాగవచ్చును. కంది, ఉలవ, పెసరపప్పులు — కట్లు అన్నంలో కలుపుకొని నెయ్యివేసుకొని తినవచ్చును. వెల్లుల్లి మొదలగు కారంచేసే పదార్థాలు తినవచ్చును. బీరకాయకూర, పొట్లకాయకూర, తినవచ్చును దాహం వేసినప్పుడు మరిగించి చల్లార్చిన నీరు త్రాగడం శ్రేయస్కరం. కొవ్వు లేక కాచిన మేకమాంసం, కోడి మాంసం, కుందేలు మాంసం తినవచ్చును స్నానం వేడి నీళ్ళతో చేస్తుండాలి [illegible] నీటిలో పుక్కిలించి ఉమ్మివేయడం గాని, తగుమాత్రం త్రాగడం గాని చెయ్యడం వల్ల దంతవ్యాధులు నిమ్మళిస్తాయి

**అపథ్యములు.—**

[illegible] అన్నం, క్రొత్తబియ్యపు అన్నం, చద్దన్నం తినకూడదు కఠినంగా ఉండే పదార్థాలు తినకూడదు మిక్కిలి వేడిగాగాని, మిక్కిలి చల్లగాగాని, ఉండే పదార్థాలు తినకూడదు. మినుములు, పెసలు, సెనగలు పిండితో చేసే పదార్థాలు తినకూడదు దోసకాయకూర, వంకాయకూర, గుమ్మడికాయకూర, [illegible]కాయకూర తినకూడదు. [illegible] ఎండిన కూరలు తినకూడదు. వాతకరమయిన దుంపకూరలు తినకూడదు. చేపలు, కోడిమాంసం తినకూడదు. పుల్లని పళ్ళు తినకూడదు పుల్లని మజ్జిగ, పెరుగు త్రాగకూడదు చన్నీళ్ళలో స్నానం చెయ్యకూడదు పుల్లతో పళ్ళు తోముకోడం, కుట్టుకోడం చెయ్యకూడదు.

## పీనస రోగులకు పథ్యాపథ్యములు

ముక్కువెంట దుర్గంధముతో చీము, [illegible] రోగానికి పీనసరోగమని అంటారు.

**అపథ్యములు:—**

మంచి పాతబియ్యపు అన్నం, గోధుమ అన్నం తినవచ్చును ఉలవకట్లు, పెసరకట్లు, సెనగకట్లు అన్నంలో కలుపుకొని — ఆవు నెయ్యి వేసుకొని తినవచ్చును. బీరకాయకూర, పొట్లకాయకూర, [illegible] దుంపల కూర తినవచ్చును అల్లపు పచ్చడి తినవచ్చును అల్లం కూరలలో వేసుకొని భుజించవచ్చును. బెల్లం తినవచ్చును ఉప్పు వంటకాలలో వేసుకోవచ్చును. పాలు త్రాగవచ్చును. మేకమాంసం, పూరపిచ్చుకమాంసం తినవచ్చును.

**పథ్యములు:—**

క్రొత్తబియ్యపు అన్నం, చద్దన్నం, గురుకాన్నం తినకూడదు. వంకాయకూర, అనపకాయకూర, మునగకూర తినకూడదు. వాతం, చలవ చేసే కూరలు, పళ్ళు, తదితర పదార్థాలు తినకూడదు కల్లు త్రాగరాదు. చేపలు తినకూడదు మజ్జిగ, పెరుగు త్రాగకూడదు. చల్లని నీటితో స్నానం చెయ్యకూడదు.

**సేకరణ: ఆకొండి నారాయణమూర్తి**

# వారఫలం

## 26-1-1973 శుక్రవారం మొదలు 1-2-1973 గురువారం వరకు

**మేషం :** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో ఆందోళన కలుగుతుంది. మీరు శ్రమ పడినా ప్రయోజనం ఉండదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**వృషభం :** వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలించగలవు. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మిథునం :** మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసివస్తుంది. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** అన్నివ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**సింహం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు — సంతోషకరమైన వార్తలను వింటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ మంచితనమే మీకు కొన్ని వ్యవహారాల్లో ఇబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల :** మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం :** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాల్లో అనుకూలంగా ఉంటాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం :** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడగలదు. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**కుంభం :** మీ ఆలోచనలు ఫలిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు — బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలత పరిస్థితి యేర్పడుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. దైవ కార్యాలు నెరవేరతాయి.

—మహేష్

# విశ్రాంతి పొందండి!
# చార్మినార్ త్రాగండి.



# సంసారంలో ఋతు సంహారం



— వేటూరి సుందరరామమూర్తి

### అవతారిక

నిద్దుర పట్టని నిశిలో సుడిలో
మద్దెల దరువులు మరుపు గీతికలు
పలికిన ఒంటరి పాదయాత్రలో
కలికి వెన్నెలలు చిలికిన తోటల
పది వసంతముల పూత కథక — నా
సుడిలో తీయని మజిలీ దొరికెను—

ఆమె నవలు నే నాయకమందు
ఆమని పెట్టుకు ప్రేమకు విందు
ఆమె వచ్చినది ఆమనివలె మధు
యామినివలె బ్రతుకందగించినది
చిగురు వేసినది వగరు తీపిగా
పొగను చూపినది నగలు మేపనగి
కోరిక కుహువై తారక వెలివై
తీరిక కరువై తీరని బరువై
గడిచిన నవాల గడిపిన దినాల
తీపి స్మృతులు నా కవుల గట్టినవి.

### వసంత గీతిక

వసంత గాలులు వీచెను
వయసంత వసంతము దోచెను
వలపుల పేజీను వచ్చిన
కలయేమో కలికి కంట
తొలి వలి వెన్నెల కాచెను
పులకల మొలకలు పూచెను
కదలికలో నాడు ఆమె
కథలిక జన్మను సాగెను
పెదవుల రస రాజధాని
పదవులు రమ్మనసాగెను
అప్పు డామెకు నేనామని
ఆమె నాకు మధుయామిని
చందమామ పొంగివచ్చి
చందిటి చెక్కిన ఫోలిక
అందము పలికిన ఫేడుక
ఫింధు మధుల ఫింధు చేసి
అంది కటుల ఆ బాలిక—

"మల్లెలతో మాలగట్టి,
మాలలతో ముడుపు గట్టి
మనసన్నది నా పెన్నిధి
మానులివి మీకే యౌవనగితి
మల్లెలు తల దురిసి మురిసి
మనసే మల్లెగ మారెను
మల్లెగ మారిన మానసమున
మనువు పరిమళించెను
మల్లెల పీఠ బోలిన
పల్లవి మనసుల తోపుల
సంప లగారికా పావన
సుందర జీవితవలెలో
ఒక నిమేష మీ జీవిత
పాక సాగిన నాకు చాలు."

మల్లెకాదు అది వలపుల
మల్లెగాని—విరహమ్మన
మనిషికి ఎదల గుచ్చిన
ముల్లెగాని వేరుకాదు'

మూడునెల్ల మల్లియలివి
మూడువాళ్ల మజిలీలివి
నాడు తెలియకే మరియొక
యేడు వసంతము వచ్చెను—

### గ్రీష్మ గీతిక

"వియోగ గ్రీష్మమ్ము స్వధా
విస్ఫులింగ నిపాతమ్ము
అడియాసల పడగాడ్పుల
పడవగట్టినది గళమ్ము"
సిలో తోచెను విరహిణి
నిప్పులు దూసిన రోహిణి
ఉప్పుచేత నేమో మరి
'అబ్బిమారు మరిగి' అని
అంతలోనె మల్లెపువ్వు
లింతకురిసినావు మువ్వ
నవ్వులు పువ్వులు చేసుకు
హాసనగి గడువు కొంటి

వేసవి యిది క్రొత్త వలపు
వాసని గొనుమని తెల్లని
చీరను సింగారించిన
గౌరవపు చిగురించిన
నిశిరాతిరి మేడ మీద
తెర ఎప్పిన ఆరు బయట
మరల వసంతము వచ్చెను
మరుడు మల్లియలు గుచ్చెను.

### వర్షా గీతిక

ఆకసాన, ఆత్మలోన
అవిగో మబ్బులు పట్టెను
చిత్తమ్మున మొత్తమ్మున
చీకటులే క్రమ్ముకొనెను
నీమదిలో నామదిలో
నెమ్మిగాలులే వీచెను
అటు చినుకులు ఇటు చినుకులు
చిటపట వలపుల చినుకులు
"మామురసలే వడితే గడితే
కసిగా కోరిక బుస గొడితే
తడిదాడికి పెన్పాలి పెళ్ళాని
వడువడతనం గొడుగే ఎడితే
పిరులు పొడుము మనసు—
సరలే — ఎవరికే తెలుసు"
అని పాడితి హొక్కాని
అని మరచితి నేను, నేడు
ఎదలోపలి పెన్పదనము
ఎవరుహాళ్ళ మేలుకొన్న
నగుచు బండగారె నిప్పుడు
అహోదూరము మానసిప్పుడు
మానసిద్ధరమే అప్పుడు
మన మద్దిగసే—ఇప్పుడు
వార్థక పేనగ నాశించి
నగరులో నానిని తేలి
మారి మాగ్నగా మసం కనిపి
మన సిగ్గరి చేరినాము—

### శరద్గీతిక

"నెలవంక విదురించు వెంత కెదవులాడి
అలనోక నగవు వెన్నెలలు పూచిన వేళ
తుమ్మటంగీలలో వలపు దొరవు పొంగు
త్రుంగి నేనందింతునా పులుగున్ని
ంగి గ్రూనందింతునా"

శరాబ్దములు శరత్కాల
నిరాబ్దముల వలె వర్షిడి
కాల మహార్నిశమ్మునేడు
కత్తెరలో బడి విడివడి
నీవక్కడ నేనిక్కడ
విరసించి పోయినపుడు
సురాతేనా వీకిప్పుడు
శరజ్జ్యోత్స్నికల చప్పుడు నే

అరా ఋతువులొక చేతా
పూరాగ మందరాము—అవు
బ చంద్రదనా? కాదు ని

యామె లైటు కద జాబిలి
వాగరకత నాదగు కత
వేగ యిటుల మార్చుచుండ
నీకు బదులు యేసీలా
కోక చిలుక మది వాలునో!

'అపోలియన్' కాళ్ల క్రింద
అయినది జాబిలి మృత్తిక
ఎందుకులే నిన్నటి నా
చందన శారద గీతిక—

### హేమంతగీతిక

ఇది యిప్పుడు హనుమంతము
కనుక లేదు ఒక ప్రాంతము
కదలుతున్న హిమ వంతము
ఘనీభూత హేమంతము
వేనే చెలి నీపాలిటి
విరస భావజ గీతము!
భోగిపండ్లు కాదు గదా

## సంసారంలో ...

రేగుపండ్లు కూడలేవు
భోగి మంటలా నిరు
ద్యోగి మంటలకు తోడుగ?

"సంక్రాంతి వచ్చె సంసారకాసార క
ల్హార పంక్తికి పూర్ణ శారదవలె
జీవిత మహాకుహా చింతాతమిస్రాన
వకియ హాసవికాస చంద్రిక వలె"
పీసాలకు ఈగతి కవి
తాసవమ్ము నెత్తికొన్న,
తొలికంకులు జంట పిచ్చి
కలకు ప్రేలగట్టుకొన్న
సెనపండువు పొంగలి సరి— 'ఒరు
స్నేటు పొంగల్' తో సరి!

### శిశిరగీతిక

'చలికాలం వచ్చిందంటే
చెలి కౌగిలి నిచ్చిందంటే
తలపేదో మలుపై వలపై
చలి నెచ్చగ పిలిచిందంటే—ఆ
కథయే నవరస భరితం
అది 'ఆత్మారాముని చరితం'

అవే యా మధ్యేతమ్మని
'త్వమే వాహము'ని, అనుకొని
తనివికి తనువడ్డమై
మన ఏకాంకిక ముగిసెను—
కానీ ఆనాటి పాట
కాలావధిలేని బాట
గా సాగెను ప్రేయసీ
కాటు వేసె శిశిరవికా—
కాలనాగు బుస గొట్టెనా
కవిత జడిసి పరువెత్తెనా—
ఇప్పుడు చలి నిరుద్యోగ

మిటుపై చెలి ఉద్యోగము
కానుకు లోగిన బ్రతుకున
కవిత్వమొక శిరోగము

### రాగ మాలిక

అలరులతో చిలిగులతో
కలకలమని నవ్వు నొకటి
మంటల రగిలించుమనో
మల్లెల పూజించు నొకటి
ఇంద్ర ధనుష్కాంతమున
జలకేళి సల్పునొకటి
శత సితాబ్ద మధ్య నహో
గత శారద హాస మొకటి
మృత్తికలో వంటదీప
ముత్యమ్ముల రాల్చునొకటి
విరహి జనమ్ముల గలిపెడు
మరుని విల్లు మరియొక్కటి
షడృతువు సంసారమ్మిది
షడ్రస కాసారమ్మిది
అవని నీవు హృదయేశ్వరి
ఆకాశము నాగతమేను!
నాలో మారిన రంగులు
నీలో తీరిన పొంగులు
మడియున్నది మధుర మహాలి
బ్రతుకే ఒక స్వప్న జగతి.

### కాల మాలిక

మును పెరుగనిదీ ముంగిలి
ముగ్గురు బిడ్డల లోగిలి
ముగ్గు బుట తలకెత్తగ
ముంచుకు వచ్చెనులే కల
జనకుని చేసితివి నన్ను
జనని ధరిత్రివి నీవయి
'మనుమసిద్ధి' గా నిలిపెడి
వనుకొందును రాగమయి—

సెలవాయిక శతషడ్రుతు
పరితాంక! కృష్ణవేణి!
మనుగడ గుడిలో నిలిచిన
మంగళ దేవతవు రాణి! ●



SOAP
LASTS LONGER SAVES MONEY
SAVES CLOTHING
MADE IN INDIA
THE TATA OIL MILLS
COMPANY LIMITED
501
501 साबुन 501
501
టాటా ఉత్పత్తి




# ఖబర్దార్-ఖూనీకోర్

డా॥ కొర్రపాటి గంగాధరరావు

## 2

'మొసళ్ళనిండా కాదు. మొసళ్ళ నోటి నిండా పళ్ళుంటాయ్. అదే రాయి తర్వాత ...రెండవ ప్రక్క కొండ. నిట్ట నిలువునా పైకి లేచిన కొండ. ఎక్క శక్యంగాని కొండ. అతి భయంకరంగా వుంది.. చీకటి ......అయినా వకుళ ధైర్యంగా ముందుకు వెళ్ళిపోతోంది ఆమె మొహం మీద స్వేద బిందువులు తళ తళా మెరుస్తున్నాయి.'

'లాభంలేదురా' అని రంగనాథం పెన్ను క్రింద పెట్టేశాడు.

'ఏం ?'

'ఎనభై—తొంభై కిలోమీటర్ల స్పీడులో పోతున్న హీరోయిన్‌కి చెమట ఎందుకు పడుతుందీ ? అంత చీకట్లో చెమట తళ తళ ఎట్లా మెరుస్తుంది ?'

'అవును; కొట్టెయ్యి'

'రాయనే లేదులే'

'ఆమె మొహంమీద స్వేదబిందువులు లేవు అని చీకట్లో తళతళా మెరియటం లేదు ఆమె గుండెల్లో భయంలేదు. చీకట్లను చీల్చుకుంటూ తారాజువ్వలాగ దూసుకు పోతోంది ముందుకు అంతలో—!'

'అంతలో—?' రంగనాథం కొంచెం నిజంగానే ఆదుర్దా పడినట్లున్నాడు.

'ఆగు; అదే ఆలోచిస్తున్నా'—

ఇప్పుడు హీరోయిన్ హత్య జరిగి పోవాలి ఈ హత్య ఎట్లా చెయిద్దాం. హత్యచేస్తే భయంకరంగానూ అందం గనూ అద్భుతంగానూ వుండాలి ఎవరు హత్య చేశారో మనకు తప్ప మరెవ్వరికీ ఛస్తే తెలియకూడదు. హత్యకూడా రివాల్వరుతోనా ? కత్తితోనా —? సుత్తి తోనా—? ఇవ్వేవీగాక కారు హేండిల్ తోనా—? ఇవ్వన్నీ మనం ముందుతేల్చాలి'

'రివాల్వర్‌తో అయితేనే బాగుంటుం దిరా—చూట్టానికి—నాజూగ్గా. ఈ రోజుల్లో గూడా కత్తితోనూ సుత్తితోనూ హత్య చెయ్యటమేమిటి ? ఏమో; నా ఓటు రివాల్వర్‌కే. హత్య ఎట్లా చేయించటమో కొస్త ఆలోచించాలి.

'అంత తేలిగ్గా నేసెయ్యగూడదు. రివాల్వర్‌తో హత్య చేయిస్తే...!'

'ఎవరినీ' అంటూ వకుళాదేవి అక స్మాత్తుగా గదిలోపలికి వచ్చింది.

'మిమ్మల్నే' అన్నాడు రంగనాథం యాంత్రికంగా.

వకుళా—'క్రీ'—అని కీచుగా పెద్దకేక వేసింది.

'ఏమిటదీ ?' అన్నారు స్నేహితు లిద్దరూ.

'అవునూ; హత్యగావించ బడ్తుంటే అట్లాగేగా కేకవేసేదీ ?' అంటూ కిలకిలా నవ్వింది వకుళాదేవి.

'ఎక్స్‌క్యూజ్ మీ మీ పేరేమిటన్నారూ' అంటూ వకుళ రంగనాథంవంక తిరిగింది.

'రంగనాథం'

'మీ రెప్పుడన్నా రాజమండ్రి వచ్చారా—ఇప్పుడన్నా—ఏ పుష్కరాలు కన్నా ?'

'రాలేదు.'

'అరే !' అంది వకుళ—

'సరిగ్గా జ్ఞాపకం చేసుకోండి. ఇప్పుడూ పొరబాటున గూడా రాజమండ్రి రాలేదా !' రూఢికోసం అడిగింది మళ్ళీ.

'లేదు.'

'అయితే మిమ్మల్నిపోలిన వారెవ్వరో అన్నమాట—సరిగ్గా మీలాగే వుంటారు. రాజమండ్రిలో చూశాను. అంతే ఫస్ట్ సైట్‌తోనే ప్రేమించి పారేశాను—ఏం లాభం ! మళ్ళా ఆయన ఎక్కడా కనిపిం చందే—! సరే, ఆఖరుకు ఈయన దొరి కాడు—నా ప్రాణానికి అనే అడుగుదామని వచ్చాను పొరబాటున కూడా మీరు రాజ మండ్రి రాలేదుగా ?'

'లేదు.'

'వచ్చివుండరు లెండి. వచ్చివుంటే...! దేనికు లెండి—వస్తా' ఆమె వెనక్కి తిరిగి వెళ్ళబోయింది.

'ఆగండి.' అన్నాడు రంగనాథం.

ఆమె ఆగింది.

'మీవారు పెద్ద ఆస్తిపరులన్నారు గాదూ.'

'ఏం లాభం! వట్టి అనుమానం మనిషి. నేను మీతో యీమాత్రం మాట్లాడటం చూస్తే చాలు; అనుమానిస్తారు అదోరకం. నిజంగా ప్రేమించిన వాళ్ళయితే ఎట్టి పుణ్యానికి అనుమానిస్తారా?'

'ఉహూ; అనుమానించరు.'

'పోని గట్టిపుణ్యానికి అనుమానిస్తారా — అంటే మీలాటివాళ్ళతో మాట్లాడితే అనుమానిస్తారా?'

'ఉహూ'.

'మీ గదిలో కాసేపు వుంటే అనుమానిస్తారా?'

'ఉహూ; ఆఖరికి నిజంగా ఒళ్ళో కూర్చున్నా అనుమానించరు.'

'నా ఖర్మ. ఆయన అనుమానిస్తారు. ఆస్తివుంది. ఏ లాభం? ఇంకేంలేదు. అబ్బ; మిమ్మల్ని చూస్తుంటే కాసేపు యిక్కడే కూర్చోవాలని వుంటుంది. ఎందువల్లా—' వకుళ కూర్చుంటూ అన్నమాట తిన్నీ. కాని రామం ఆమెను కూర్చోనివ్వలేదు. ఎవకన వుంది—కుర్చీ వెనక్కి లాగేశాడు.

'వీల్లేదండి మేం ఒనవల రాస్తున్నాం. మీరిక్కడ కూర్చుండి పోతే మాకు రచన సాగదు. ఎక్స్‌క్యూజ్ మీ. మీరు వుంటే చాలా సరదాగానే వుంది కాని, వెళ్తే చాలా బాగుంటుంది.'

రామం అంత నిర్మొహమాటంగా చెప్పినా ఆమె అక్కణ్ణించి కదిలేట్టు కనిపించలేదు కాని ఆర్తత్రాయుపరాయుణుడి లాగ ఆమెభర్త దీక్షితులు వచ్చాడు.

'ఇంకా అవలే ఏకబుర్లా? వదీ



వద; చెప్పిన సోది చాలు.' వకుళ రుస రుస అతనివంక చూశింది. చరచరా బయటకు నడిచింది.

'మరేం అనుకోకండి. ఈతడవ యిల్లా వచ్చి మిమ్మల్ని డిస్టర్బ్‌చేస్తే, మెడబట్టి గెంటేయండి. నేనేం అనుకోను.' అంటూ ఉచిత సలహాయిచ్చి దీక్షితులు వెనకనే వెళ్ళిపోయాడు. వాళ్ళిద్దరూ దూరంగా వెళ్ళేదాకా వూరుకున్నాడు రామం. తర్వాత 'ఈమెకూ ఆయనకూ మధ్య వచ్చిగడ్డేవేస్తే భగ్గుమనేట్టుందిరా. ఏమంటావ్?' అన్నాడు

'వచ్చి గడ్డేగా!— కాస్త వేద్దామా' అన్నాడు రంగనాథం.

'వేద్దాం; మన నవలలో వేద్దాం. ఏందాక రాశావ్?'

రంగనాథం ఆఖరి వాక్యం చదవనారంభించాడు. 'చీకట్లను చీల్చుకుంటూ ఆమె తారాజువ్వలాగ దూసుకుపోతోంది. అంతలో!'

'అంతలో?' రామం అందుకున్నాడు.

అంతలో వెనకనుంచి ఒక అజ్ఞాత హస్తం లేచింది — వ్యూ ఫైండర్‌లో వకుళాదేవికి ఒక ముసుగుమనిషి కనిపించాడు—ఆమె కెవ్వున అరిచింది అంతలో .. ఆ అజ్ఞాత హస్తం రివాల్వర్ పేల్చింది. వకుళాదేవి స్టీరింగ్‌మీదే ఒరిగిపోయింది.'

రంగనాథం ఆఖరిమాట కూడా వ్రాశి 'బాగుందిరా; ఎట్లాగయినా నువ్వు హత్యలు బాగా చేయిస్తావ్' అన్నాడు.

రామం కాస్త పొంగిపోయాడు. 'హీరోయిన్‌ని హత్య చేయించిన ఈ శుభ సమయములో—మనం కాస్త కాఫీఅన్నా త్రాగకపోతే ఎట్లా?' అంటూ బెల్ నొక్కి కాఫీ ఆర్డరిచ్చాడు. కాఫీతోబాటు లోపలికి భీమశంకరం మోహనాంగి వచ్చారు.

వస్తూనే మోహనాంగి రామాన్ని అడిగింది.

'ఏమండీ, మీరెప్పుడన్నా సినిమాల్లో వేషం వేశారా?'

రామం తెల్లబోయి—'లేదే' అని—తెల్లబోతూనే వున్నాడు.

'అయితే ఎవరో మరి! ఓ సినిమాలో చూశాను. సరిగ్గా మీ పోలికే, అంతా అచ్చంగా మీరే అన్నా! సినిమా కాబట్టి కాని—లేకపోతేనా...'

రామం ఒకనిమిషం లేకపోతే ఏమిటూ? అని ఆలోచించాడు.

## ఖబడ్దార్-ఖూనీకోర్

అంతలో మోహనాంగి మరో సందేహం వెలిబుచ్చింది.

'పోనీ — మీరెప్పుడన్నా సర్కస్ లో బఫూన్‌గా వచ్చారా?'

'లేదు'

'పోనీ నాటకంలో'......?

'అదీ లేదు.'

'అరే! మరి నాకింత చూశిన జ్ఞాపకం ఎట్లా వుందండీ చూసినట్టేగాదు బాగా చనువున్నట్లూ బాగా మాట్లాడినట్లూ...'

'ఆ; ఆ; బాగా డ్యూయెట్లు పాడినట్లు గూడా వుందా' అంటూ ఆమె భర్త భీమశంకరంగారే మాటకు అడ్డం వచ్చారు.

'ఆ! ఉంది.'

నీ కట్లాగే వుంటుంది—కుర్రవాళ్ళనెవర్ని చూశినా. ఇదేం కొత్తగాదులెండి మా ఆవిడకిది అలవాటు ఇంతకూ మేం వచ్చింది—మీరే సర్కస్‌లో వర్క్ చేశారో తెలుసుకోటానికిగాదు. ఈ రాత్రికి మీ కారు కాస్త అరువిస్తారేమో కనుక్కుందామని. మీకు అభ్యంతరం లేకపోతే మీ కారులో కాస్త టవున్‌లోకి వెళ్ళివస్తాం.'

రామం కాస్త ఆలోచించాడు. తర్వాత, 'అభ్యంతరమేంలేదు. కాని కారులో పార్టులన్నీ లెక్కేసుకుని మరీ కారు తీసుకెళ్ళండి. దోవలో ఎక్కడన్నా ఏ పార్టన్నా జారి పడిపోతుందేమో చూసుకుంటూ వెళ్ళిరండి. కార్లో పార్టులన్నీ స్పేరు పార్టులే. 1925 మోడల్—1945 మోడల్‌గా మారిపోయిందంటే.'

'అల్లాగా!' అన్నాడు భీమశంకరం. తర్వాత—'నేను రాత్రికి టౌనుకు వెళ్ళి తీరాలి. రాత్రి విమానంలో వో స్నేహితుడు వస్తాడు. ఈవిణ్ణి ఒంటరిగా వదిలి వెళ్ళాలే! అని ఆలోచిస్తున్నా. సరే; వద్దులెండి; నా స్నేహితుణ్ణే యిక్కడకు రమ్మని ఫోను చేస్తాను' అంటూ నెమ్మదిగా లేచి—'పదవే' అన్నాడు 'పదవే' అని సంబోధించినందుకు మోహనాంగి మండి పడుతూ లేచింది.

'మానర్స్ లేవు! మట్టీలేదూ; అందరి ఎదటా పట్టుకుని 'పదవే—గిదవే' అనటమే ఆగావేం? పదా' అంటూ భీమశంకరాన్ని దాదాపు గెంటుకుంటూ వెళ్ళిపోయింది

స్నేహితులిద్దరూ మళ్లీ వెంటనే కథ ఆలోచించటం మొదలు పెట్టారు అరగంట ఆలోచించినా హత్య ఏవిధంగా చేయించటమో తేలలేదు. హత్య రివాల్వర్‌తో జరగచ్చు లేదా గట్టి తాడుతో ఉచ్చువేసి జరపవచ్చు. కత్తి సుత్తి వ్యవహారం సుతిమెత్తగా వుండదు. తాడు, మెత్తని తాడయితే—హత్యకూడా మెత్తగానే వుంటుంది. రివాల్వర్ హత్యలో నానాఫైలే వుందిగాని—రివాల్వర్ ఎక్కడనుంచి వచ్చింది? దాని నంబరెంత? సైజు ఎంత?— ఈ ప్రశ్నలన్నీ వస్తాయి రివాల్వర్‌తో హత్య భారతదేశంలో సాధారణంగా ఎక్కడా జరగదు. జరిగితే—ఇంగ్లీషు నవలల ప్రకారం గూడా—పట్టుబడటం తేలిక అంతా కూలంకషంగా ఆలోచించి — చివరికి స్నేహితులిద్దరూ మెత్తని సిల్కుతాడుతో హత్య జరగాలనే నిశ్చయానికి వచ్చేశారు.

వ్రాయటం మొదలుపెట్టారు.

'అంతలో వెనకసీటులోనుండి ఒక ముసుగుమనిషి లేచాడు. ముందు హస్తాలు కనిపించాయి. తర్వాత ముసుగులోంచి

## గుమస్తా

టేబుల్‌మీద పర్వతమెత్తు ఫైళ్ళు
రాస్తున్నాడు తలవంచిన వీరుడు —
గుండె నిండా దిగులుతో
కనిపించని కన్నీళ్ళతో!
పదేళ్ళ నుండి రాస్తున్నా
పస్తులు మాత్రం తప్పడం లేదు.
అప్పులు ఏమాత్రం తీరడంలేదు
వడివడిగా పెరుగుతున్నయ్ వడ్డీలు!
చింపిరి తలలో చినిగిన బట్టలో
'ఛీ' అనిపించేట్టున్న చిన్నపిల్లలు —
మెడలో పసుపుతాడు మాత్రంమిగిలి వుండి
జీవచ్ఛవంలా ఉన్న యిల్లాలు —
కన్నీళ్ళు కారుస్తున్నట్టుగ
ఫైళ్ళలో కనిపిస్తున్నారు!
తనకు మాత్రం కన్నీరు రావడంలేదు
వాళ్ళను మరచి ఫైళ్ళలో పడిపోతున్నాడు
తప్పులు రాస్తే ఉద్యోగం పోతుంది
ఇప్పుడున్న చిన్నదీపం ఆరిపోతుంది

—జి. వి శర్మ

!ళ్లు—! గుడ్లగూబలాంటి కళ్లు—!
కర్వాత భుజాలు—! నకుళ ముందున్న
ఎద్దంలో వెనకనున్న భూతాన్ని చూసింది.
కెవ్వున కేక వేసింది. చేతిలో స్ప్రింగు

పట్టు తప్పిపోయింది. కారు రోడ్డు
అంచులు రెంటినీ అంటుకుంటూ, వంకర
టొంకరులుగా పరుగెత్తుతోంది. హంతకుడి
కబంధ హస్తాలు పైకి లేవాయి! ఆ కిరాతక

హస్తాల్లో ఒక బలమైన వ్రేలని సిల్కు
తాడుంది! అది మరుక్షణంలో—నకుళాదేవి
సుకుమారమైన గళసీమ నలంకరించింది.
రాయం చెప్పుకుపోతున్నాడు. రక్తిలో

# ఖబర్దార్-ఖూనీకోర్

కొట్టుకుపోతున్నాడు.

అంతలో రంగనాథం—

'ఆగు' అన్నాడు.

'ఏం ?' రామం విసుక్కున్నాడు. 'అబ్బబ్బా నీ సహాయం లేకపోతే నేనీనవల ఈ పాటికే రాశిపారేశి వుండేవాణ్ణి' అన్నాడు.

'హత్యచేసే తాడు గళసీమ నలంకరించటమేమిట్రా? ఇదేమన్నా బంగారపు గొలుసా!— మంగళసూత్రమా! పూలదండా?'

'సరే కొట్టెయ్యి. కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. రక్తిగట్టే సన్నివేశాలు చెప్తుంటే— పానకంలో పుడకలాగ మధ్యలో అడ్డంరాకు, ఔచిత్యాల సంగతి చివరకు చూసుకున్నా చూసుకోవచ్చు. అచ్చయ్యే టైంలోనైనా దిద్దిపారెయ్యవచ్చు. ఇక వ్రాసుకో.'

వకుళాదేవి సుకుమారమైన గళసీమను గట్టిగా చుట్టుకుంది; బిగిసిపోయింది; పంచప్రాణాలు ఎగిరిపోయాయి—! వెంటనే హంతకుడు కారులోంచి దూకేశాడు. కారు మూడు పిల్లి మంతరాలేసి లోయలోకి జారిపోయింది. 'ఛ; బాగుండలేదు; కొట్టెయ్యి'

'మొత్తమా ?'

'కాదు; ఆఖరి వాక్యం కొట్టేసి — కారు లోయలోకి పడిపోయి దొర్లింది — మళ్ళా పడింది— మళ్ళీ దొర్లింది — మళ్ళీ—'

'పాపం!' అన్నాడు రంగనాథం.

'ఏమిటా పాపం?'

'ఈ కారుకెంత కష్టమొచ్చిందిరా' అన్నాడు రంగనాథం.

అక్కడ మళ్ళా రచనా వ్యాసంగానికో భంగం వాటిల్లింది.

బయటనుంచి కాలభైరవంగారు ప్రవేశించారు. 'ఏమండీ; ఏమండీ; మీదగ్గర ఏస్ప్రిరిన్ బిళ్ళలున్నాయా ?'

'లేవు; ఏందుకూ' రంగనాథం ఖంగారుగా అడిగాడు.

'మా ఆవిడకి తలనొప్పి. ఈ హోటల్లో ఎవ్వరిదగ్గరా ఏస్ప్రిన్ బిళ్ళలు లేవు. ఆఖరికీ— మీరు రచయితలుగదా— మీ దగ్గర తప్పకుండా వుంటాయన్నది— ఆ వకుళాదేవి, మీ దగ్గరా లేకపోతే...?'

'అని మాట నసుగులోకి మార్చి ఆయన వెనక్కి తిరిగారు. తలుపుదగ్గర వెనక్కి తిరిగి 'ఓడజను బిళ్ళలు దగ్గరుంచుకోండి సార్; రాయగా రాయగా మీకు తలనొప్పి రాకమానదు' అని ఉచిత సలహా యిచ్చి, వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళాడూ; రెండవ అధ్యాయం యింకా మొదలుపెట్టలేదూ; అంతలో ఫజల్ సాహెబ్ ప్రవేశించాడు.

'ఓహో ఫజల్ సాయిబ్ గారా రండి' అంటూ ఆహ్వానించాడు రంగనాథం.

'సాయిబ్బు గాదు—సాహెబ్— 'హా' కి ఏత్వం' సరిదిద్దాడు రామం.

'అవునవును. హా కేత్వమిస్తే 'హే'. అవును; సాయిబ్బుగారూ, ఈ 'హ' కీ. 'హా' కీ తేడా ఏమిటి ?'— ఫజల్ సాహెబ్ గారి కీ తేడాలు చెప్పే సావకాశం ప్రస్తుతానికి లేదు లాగుంది. వెంటనే—

'మీదగ్గర ఒక పనికిరాని కాగితం వుంటే యివ్వండి' అన్నాడు.

పనికిరాని కాగితాలు తక్కువే వున్నాయి యిప్పటికింకా రచయితల దగ్గర. ఉన్న ఒక్క కాగితం యిచ్చేశాడు రంగనాథం. దానిమీద రాసుకుంటూ ఫజల్ సాహెబ్— 'ఊ చెప్పండి; మీకు మధ్యాహ్నం యేం టిఫిన్ కావాలి ?' అని అడిగాడు.

రామం ఇద్దరికీ రెండు ఆమ్లెట్లూ, కాఫీ ఆర్డరిచ్చాడు. రంగనాథం యిద్దరికీ బ్రెడ్ అండ్ బటర్ ఆర్డరిచ్చాడు. ఎవరు ఆర్డరిచ్చినా యిద్దరూ అన్నీ తినవలసినదే. వాళ్ళిద్దరి స్నేహం అట్లాంటిది.

రాత్రికి 'మెనూ' కూడా అడిగి తెలుసుకుని, వ్రాసుకుని, ఫజల్ సాహెబ్ వెళ్ళిపోయాడు.

'అంతా స్వయంగా చూసుకుంటాడు ఈ ఫజల్ సాహెబ్. ఇది ఆయన స్పెషాలిటీ' అనుకుని స్నేహితులిద్దరూ మళ్ళా కథా నిర్మాణంలో పడ్డారు కాని— కథ అంగుళం కదలలేదు. టిఫిన్ తిన్నా కదల్లేదు. ఆరాత్రి భోజనం చేసినా కదల్లేదు.

ఇక లాభం లేదని పడుకుని నిద్రపోయారు.

తెల్లవారినతర్వాత తలుపు తీసేసరికి — వినబడిందొక ఘోరమైన వార్త ! ఆరాత్రి వకుళాదేవి కారులో వెళ్తుంటే — దోవలో హంతకుడు—ఎర్రని సిల్కుతాడుతో—వకుళాదేవి కంఠానికి ఉచ్చుబిగించి హత్యచేశాట్ట!

తప్పక చూడండి!

లక్ష్మీ ఆర్ట్స్

# పంజరంలో



# పసిపాప

దర్శక-నిర్మాత: గిడుతూరి సూర్యం

VIJAYA

శ్రీ కళ్యాణీ పిక్చర్స్

# ఇది ఎవరు రాస్తున్న చీకటి "పుట?"

ఆరిపోతున్న 'దీపం'
మీద కోపంగా దూసి 'కత్తి'
వెలిగించలేవు దాన్ని నేస్తం
ఇది ప్రజాస్వామ్యం!
ప్రజల మధ్యనుంచె
ఎగిరిపోయింది శాంతి పావురం
ఎగరేసి దమననీతి 'జేగ'
దాన్ని వేటాడకు నేస్తం
ఇది ప్రజాస్వామ్యం!
నుదుట 'రక్త' తిలకం
ధరిస్తున్నప్పుడు 'జనం'
వాని ఎదుట 'రక్తపాతం'
దాన్నాపలేదు నేస్తం
ఇది యింకా 'ప్రజాస్వామ్యం'
గుండెల్లో ప్రవల'ములుకై
రగిలే మంటలు 'బయట'
చన్నీళ్ళు పోస్తే చల్లారుతాయా?
నేస్తం! ఇది ప్రజాస్వామ్యం!
ప్రగతి రచన్నిలాగు 'గుర్రాలు*'
జనం మొరాయించినప్పుడు
తుపాకీ గుర్రా'ల నదలించి
'దా న్నిడ్పటం సాధ్యమా? నేస్తం
ఇది ప్రజాస్వామ్యం
కొన్ని గొంతులైతే
కొన్నాళ్ళు అన్ని గొంతులూ
అరిచినా 'కొన్నాళ్ళు' కాని
నేస్తం! 'ఎన్నాళ్ళో' గొంతులన్ని
'నొక్కి' ఉంచటం కష్టం!
కారణం ఇదింకా ప్రజాస్వామ్యం!
దీపం వుండగా చక్కబెట్టలేని ఇల్లు
పాగా నీళ్ళా లేనివేళ
'దీపాలార్పి' చక్క బెట్టడం
నీతికాదు నేస్తం! రాజ
నీతి సైతం కాదు
అదింక ప్రజాస్వామ్యంకాదు
కోపడకు నేస్తం!
ఇది కవి రాస్తున్న 'చీకటి పాట' కాదు
జన సామాన్యం అంటున్నమాట
కోపడకు నేస్తం!
ఇది 'గద్దె' మీదున్నవాళ్ళు
చే చేతులా రాసుకుంటున్న 'చెడ్డ పుట'
రేపటి చరిత్రలో మిగిలిపోయే 'చీకటి పుట!'

(జనవరి 6 కర్నూల్ రాత్రి)

* తుపాకీ 'గుర్రం'—తుపాకీ 'ట్రిగ్గర్'

—వీరాజీ.

## ఖబర్దార్-ఖూనీకోర్

శవాన్ని కారుని రోడ్డుమీద వదిలేశాట్ట! పోలీసులు పరీక్ష చేస్తున్నార్ట!

* * *

ఆ వార్త వినగానే రంగనాథం పొంగిపోయాడు. ఉప్పొంగిపోయి గంతులేశాడు. గది తలుపులు వేశివున్నవి, గనక గానీ—లేకపోతే అతని కేకలు చాలామంది వినేవాళ్ళు.

'మనం ఇక కథ వెతుక్కో నక్కర లేదురా. జరిగినది జరిగినట్లు ఈ వకుళాదేవి హత్య కేసే రాసిపారేద్దాం. సరిపోతుంద'న్నాడు.

రామానికీ ఆలోచనేమంత రుచించలేదు. చూశి వున్నది వున్నట్లు వ్రాసేవాడు చూచి వ్రాతగాడు గాని, రచయిత కానేరడని అతని అభిప్రాయం. 'రవి గాంచనచో—కవి గాంచవలె' అని అతని ఆదర్శం. అందుకే రంగనాథం ఎగిరి గంతులేస్తుంటే, అతను తీరుబడిగా కూర్చుని ఆలోచిస్తున్నాడు.

'ఇప్పుడు మనం కాసేపు సరిగా ఆలోచించాలి. నన్ను డిస్టర్బ్ చెయ్యకు. నువ్వు డిస్టర్బ్ కాకు. ఆ పోలీసులు యెవరో వస్తారు! అందర్నీ ప్రశ్నిస్తారు! ఫస్ట్ ఇన్‌ఫర్మేషన్ రిపోర్ట్ తీసుకు వెళ్తారు. తర్వాత వాళ్ళ తంటాలు వాళ్ళు పడ్తారు. అదంతా మనకు అనవసరం.

మనకిప్పుడు హంతకు డెవ్వరో తేలాలి. ఎవరు? ఎవరు మన హంతకుడు? ఈ హోటల్‌లో మనం వున్నాం. మనం హత్య చేయలేదు. పోతే దీక్షిత్ వున్నాడు. భీమశంకరం. ఆయన భార్యా వున్నారు. తర్వాత కాలభైరవం, ఆయన శ్రీమతీ వున్నారు. ఫజుల్ సాహెబ్ — ఆయన అనుచరులూ వున్నారు. వీరిలో ఎవరో—ఎవరో ఒకరు—ఈ దారుణమైన హత్యచేసి వుండాలి.'

'కాలభైరవంగారిచేత ఈ హత్య చేయిద్దాంరా. పేరు భయంకరంగానే వుంది. మనిషి సరిగ్గా ఖూనీకోరులాగే వుంటాడు. భార్య చాలా పతిసేవాపరాయణురాలు లాగా కనిపిస్తోంది కూడా— అంతా చక్కగా సరిపోతుంది.'

'ఈ సరిపోవటం చాలదురా, నాగన్నా. హంతకుడంటే ముఖ్యంగా మోటివ్ వుండాలి. హంతకుడికి ముఖ్యం చేతిలో

ఏదో ఒక ఆయుధం గాదు. మనిషిలో హత్య చేయటానికి గల కారణం.'

'ఏడిశావ్; అదేం అక్కర్లా— మన తెలుగు నవలల్లో,'

'కాదు; మన నవలలో కావాలి. అది లేకపోతే అసలు హత్యే జరగదు.'

'మరి యిప్పుడు జరిగిపోయిందిగా! జరగదంటా వేమిటి?'

'కనక 'మోటివ్' వుండే వుంటుంది. 'ఏమిటది?' అది ముందు మనం కల్పించాలి తప్పదు.'

'సరే అంతగా తప్పకపోతే— కల్పించు.'

రామం మొహం ఒక్కసారి విప్పారింది. 'కల్పించా' అన్నాడు. చెప్పటం మొదలెట్టాడు.

'వ్రాసుకో...వెంటనే పోలీసుస్టేషన్‌కు ఫోను వెళ్ళింది. ఎస్సయ్, కొందరు పోలీసులాయుధాలతోనూ, మరికొందరు వస్త్రాలతోనూ వచ్చారు వారి వెనకనే ఫోటోగ్రాఫర్లు వచ్చారు క్షణం ఆలస్యం చేయకుండా సబ్ ఇనస్పెక్టర్ యుగంధర్...'

'ఛ, పేరు బాగా లేదురా యుగంధర్ అనగనే పిచ్చివాడు జ్ఞాపకం వస్తాడూ'

'పోనీ చాణక్య!—'

'వద్దురా 'రోజులు మారాయి 'జ్ఞాపకం వస్తోంది.'

'పోనీ— భోలానాథ్'

'ఆ, అది బాగుంది, ఏమిటి? భోలానాథా!

'కాదు, భోలానాద్, 'భో'కి వత్తు— దీర్ఘంతో వట్టి 'ల''

'భో. .లా నా. ధ్. బాగుంది భయంకరంగా వుంది అమాంతం వుండాలి'

'సబ్ ఇనస్పెక్టర్ భోలానాథ్ శవపరీక్ష చేశాడు పరిసరాలన్నీ పరీక్షించాడు కావల్సిన ఫోటోలన్నీ తీయించాడు శవం మీద వున్న నగలూ— —ట్రా —బితా వ్రాయించాడు చేతితో తాకకుండా 'ఎక్రసిల్కు తాడు' పొట్లం గట్టించి సీలు చేయించాడు. పరిసరాల్లో ఎవరివో పాదాల గుర్తులు గమనించాడు 'ఇవ్వి పురుషులవే సందేహం లేదు అన్నాడు'

'ఎవరా అన్నది?' రామం వాగ్ధాటి కడ్డం వస్తూ రంగనాథం అన్నాడు.

'ఎంకెవరంటావూ? ఎస్. ఐ. భోలానాథ

'అతనికి మాత్రం సందేహం ఎందుకు లేదూ?'

'లేదు; ముందు రాసెయ్యి; అంతే అతను నవ్వా నేనునా? ఎస్సయ్ భోలానాథ్!'

'పోనీ—అదిసరే; వ్రాస్తాను. కాని ఈ హంతకుడి అడుగుజాడలు ఎట్లా పడ్డాయక్కడ?'

'పడ్డాయి; రాత్రి వర్షం కురిసింది.'

'నిన్నరాత్రి వర్షం కురిసినట్లుంది; నిజమే కాని మనం కాగితంమీద 'రాత్రి వర్షం కురిసిందని' రాయలేదే!'

'సరే, రాద్దాం — ఫెయిర్‌కాపీలో. ఇక్కడమాత్రం ఒక 'నోట్' వ్రాయి— 'రాత్రి వర్షం పడాలి.'

'సరే.'

'ఇక వ్రాసుకో. అనేక హత్యల్లో ఆ తేరిన ప్రఖ్యాత నేరపరిశోధనా చక్రవర్తి ఎస్. అయ్ భోలానాథ్— !'

'ఈ ఎస్. అయ్ కూడా హత్య చేశాడా?'

'లేదే!'

'మరి 'హత్యల్లో ఆరితేరిన' అన్నావేం'

'చంపేవ్; కొట్టెయ్యి అనేక హత పరిశోధనలల్లో' అని మార్చు.'

'మార్చా!'

'ఎస్. అయ్ భోలానాథ్—ముందు చచ్చి పోయిన వకుళాదేవి భర్త అయిన దీక్షిత్ దగ్గర వాఙ్మూలం తీసుకున్నాడు.

'వా...?'

'.. .....'

వాఙ్మూలం తీసుకున్నాడు. దీక్షిత్ తనకు తెలిసినదంతా చెప్పటం మొదలు పెట్టాడు.

'క్రిందటిరాత్రి తొమ్మిదిన్నర గంటలకు వకుళ నాతో దెబ్బలాడింది. అది సామాన్యంగా రోజూ జరిగేదే కాని రాత్రి వకుళ ఎందుకో మరింత రెచ్చిపోయింది నేను నిద్రపోయిన తర్వాత, లేచి వెళ్ళిపోయి నట్టుంది తెల్లవారిన తర్వాత—లేచిచూస్తే—కనబడలేదు. అంతకంటే నాకేం తెలియదు.'

ఎస్సయ్: ఆమె వంటిమీద ఏమైనా నగలు వున్నాయా?

దీక్షిత్: అట్టే లేవు ముఖ్యమైన దొక్కటే—వజ్రాలహారం వుంది.

ఎస్సయ్: శవంమీద వజ్రాలహారం లేదు.

దీక్షి: లేదూ? వజ్రాలహారం లేదూ? దీక్షిత్ చాలా తెల్లబోయాడు 'అరె! అరె!' అని పదిసార్లు అనుకున్నాడు

ఎస్సయ్: అది మీరు చేయించినదేనా?

దీక్షి. కాదు.

ఎస్సయ్. మరెవరు చేయించారు?

దీక్షి. ఆమె భర్త.

ఎస్సయ్: మీరు ఆమె భర్తగాదా?

దీక్షి: నేనూ భర్తనే.

ఎస్సయ్ అంటే నాకు అర్థంకావటం లేదు.

ఇనస్పెక్టర్ ఆశ్చర్యంతో అడిగాడు..

'రాస్తున్నావా' అంటూ రామం రంగనాథం వంక తిరిగాడు. రంగనాథం వ్రాయటంలేదు.

'నాకూ ఆశ్చర్యంగానే వుందిరా' అన్నాడు దీనంగా.

రామం నవ్వేశాడు.

'ఏముందోయ్ వకుళ చేసుకున్న పెళ్ళాం గాదు. అసలు పెళ్ళామేగాదు వకుళకో అలవాటుంది. ఆమె మూడు సంవత్సరాల కొకసారి మొగుణ్ణి మార్చేస్తుంది.'

'మన కథలో వకుళ సంగతేగా!'

'ఆ, 'అసలు వకుళ' సంగతి మన

# ఖబర్దార్-ఖూనీకోర్

కెందుకు? రాయి.' మళ్ళీ రామం దీక్షిత్ మాటలు చెప్పటం మొదలుపెట్టాడు.

దీక్షి: అదేనండి. ఆమె మొదట వేరెవర్నో చేసుకుంది. వాళ్ళిద్దరికీ సరిపడ లేదు. తర్వాత—'

ఎస్సయ్: తర్వాత మీరు చేరదీశారా?

దీక్షి: లేదు తనే నన్ను చేరదీసింది.

ఎస్సయ్: సరే. పోయిన వజ్రాలహారం మీరు గుర్తుపట్టగలరా?

దీక్షి: ఆ; వకుళ పేరుగూడా వుంది—దానిమీద'

అంతలో కొందరు పోలీసులు పరుగెత్తుకు వచ్చారు.

పోలీ: సార్. సార్. అడుగుజాడలు ననుసరించి వెళ్ళామండీ—అవ్వి సరిగ్గా హోటల్‌గది 'పదిహేను' దగ్గర కెళ్ళాయి.

వెంటనే భోలానాథ్ వారితో పరుగెత్తుకు వెళ్ళాడు. హోటల్ పదిహేనవ గదిని పోలీసులందరూ చుట్టుముట్టారు. సోదా చేశారు.

'ఆ గదిలో వజ్రాలహారం దొరికిందా?' రంగనాథం ఆదుర్దా పట్టలేక అడిగేశాడు.

'లేదు. లేదు. ఆ గదిలో ఏమైనా దొరికాయిగాని—ఎక్కడా వజ్రాలహారం దొరక

## ఉల్లిపాయల పెరుగుపచ్చడి

కావలసిన వస్తువులు—కొలతలు (నలుగురికి)

| | |
|---|---|
| పెరుగు | —225 గ్రా |
| ఉల్లిపాయలు | —100 గ్రా |
| పచ్చిమిరపకాయలు | —5 గ్రా |
| కొత్తిమిర | —పావు కట్ట. |
| జీలకర్ర (కావాలంటేనే వేసుకోవాలి) | —చిటికెడు |

పద్ధతి —

ఉల్లిపాయలు పొట్టుతీసి తరుగుకోవాలి పచ్చిమిరపకాయలుకొత్తిమీర తరుగుకోవాలి జీలకర్ర వాడినట్లయితే పొడి చేసుకోవాలి. పెరుగులో అన్నీవేసి కలుపుకోవాలి.

—కూ. రా.

లేదు.'

రూమ్ నంబరు పదిహేనుతో కాలభైరవం వున్నాడుగా!

'అవునూ?'

'మరి అతన్నేగా మనం విలన్ చేద్దామనుకున్నాం!'

'అనుకున్నాం.'

'మరి వాడిగదిలో వజ్రాలహారం దొరకాలిగా!'

'అదే వున్న సస్పెన్సు. అతనాహారం కోసం హత్య చేయలేదు'

'మరెందుకు చేశాడూ—ఒళ్ళు పొగరెక్కి?'

'అదీ ఒక 'మోటివ్' కావచ్చు రాయరా. నీకెందుకూ? నే చెప్తాగ; రాయి'

రామం నాలుగైదు వాక్యాలు పవాగ్న్న చేస్తూ చెప్పాడు. కాని రంగనాథం కలం కదపటంలేదు.

అనుమానం వచ్చి 'రాయనేరా' అన్నాడు రామం.

రంగనాథం కదలలేదు—మెదలలేదు.

'రంగనాథం!' అని రామం అరిచాడు దగ్గరకెళ్ళి బుజాలు పట్టుకుని కదిలించాడు

రంగనాథం దృష్టి గది నైఋతి మూల—కిటికీ క్రింద—మంచం చాటున నిలిచిపోయింది.

'చూడు, చూడు! ఆమూల ..!'

ఆమూల పద్దెనిమిది అంగుళాల పొడుగున—మిల మిలా మెరిసిపోతూ—పాములాగ మెలికలు మెలికలుగా పడివున్న—వజ్రాల హారం—కళ్ళబడి, రామం వళ్ళు ఝల్లుమంది.

బయటనుంచి హోటల్ 'బోయ్' తలుపు తెరుచుకుని వచ్చాడు గబగబా.

'సాబ్! ఇనస్పెక్టరుగారు హోటలంతా సోదా చేస్తున్నారు సాబ్! సోదా అయ్యేదాకా ఎవర్నీ గదివిడిచి వెళ్ళద్దన్నారు వెళ్తే అరెస్టు చేయవలసి వస్తుందిట.'

రామం రంగనాథం వాణ్ణి ప్రశ్నలడిగి వివరాలు తెలుసుకునే స్థితిలో లేరు. వాడు వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)

# సినిమా

## రాముడే దేవుడు!

ఫల్గుణా కంబైన్స్ నిర్మిస్తున్న పౌరాణిక చిత్రం యిది. ఈ చిత్రానికి పి. ఏకామ్రేశ్వర్రావు నిర్మాత. కథానాయకుడు పాత్రను చలం పోషిస్తున్నారు. ఇప్పటికి రెండు షెడ్యూల్సు జరిగాయి. అయిదురీళ్ల చిత్రం వచ్చింది, అన్నారు నిర్మాత ఏకామ్రేశ్వరావు. ఇంతవరకు రెండుపాటలు చిత్రీకరణ, ముఖ్య దృశ్యాల చిత్రీకరణ జరిగింది. ముఖ్యపాత్రలను ఎస్వీరంగారావు, జగ్గయ్య, నాగేష్ ధరిస్తున్నారు. నాయిక వాణిశ్రీ. రాజశ్రీ రచన్ను, సత్యం సంగీతాన్ని, మధు ఛాయను, చలం కళను నిర్వహిస్తున్న యీ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. లక్ష్మి ఫిలింస్‌ద్వారా విడుదలవుతుంది.

### లంకాదహనం!

'రాముడే దేముడు' చిత్రంలో 'లంకాదహనం' బాలే ఒకటుంది. ఈ బాలేని కొసరాజు వ్రాశారు. బాలసుబ్రమణ్యం, మాధవపెద్ది పాడారు. చలం, నాగేష్‌లపై చిత్రీకరించారు.

రావణాసురుడిగా నాగేష్, ఆంజనేయుడిగా చలం నటించారు.

### రాజకుమార్‌తో చిత్రం!

'కన్నడంలో రాజకుమార్‌తో ఒక పౌరాణిక చిత్రం ప్రారంభించబోతున్నాను,' అన్నారు ఫల్గుణాధినేత ఏకామ్రేశ్వ రావు. ఈ చిత్రంలో కృష్ణ, నారద పాత్రలను రాజకుమార్ పోషిస్తారు. వై. ఆర్. స్వామి దర్శకత్వం నిర్వహిస్తారు;

## వై. ఆర్. స్వామి తెలుగు చిత్రం

శ్రీకాంత్ నవుండప్ప చెట్టియార్ తెలుగులో నిర్మించబోయే చిత్రాన్ని వై. ఆర్. స్వామి డైరెక్టు చేస్తారని తెలిసింది. ఈ చిత్రం పేరు 'దసరా పిచ్చోడు.' టైటిల్ పాత్రను చలం పోషిస్తారు. ఈ చిత్రం కన్నడంలో విజయయాత్ర సాగించియుంది.

## దేవుడమ్మ!

ఆంధ్రదేశంలో యేర్పడ్డ విపత్కర పరిస్థితుల దృష్ట్యా 'దేవుడమ్మ' విడుదలను ఆపుచేశాను, అన్నారు చలం.

సమయస్ఫూర్తిగా వ్యవహరించే శక్తి చలంకి వుంది. పైగా అతగాడు నాయకుడిగా నటించిన 'ఊరికి వుపకారి' బాగా ప్రదర్శింప బడుతున్న తరుణంలో, తను నటించిన మరొక చిత్రాన్ని విడుదల చెయ్యడం, యిష్టంలేదు.

'దేవుడమ్మ'ను జనవరి ఆఖరికి రిలీజ్ చేస్తారేమో! ఈ చిత్రంలో జయలలిత, లక్ష్మి, రాజసులోచన, రామకృష్ణ, గీతాంజలి, రాజబాబు ప్రధానపాత్రలను పోషించారు. ఈ చిత్రానికి కె. వి. నందనరావు దర్శకుడు. శ్రీఫిలింస్ విడుదల.

### లండన్ పర్యటన!

ఊర్వశి శారద నాయకగా నటించిన 'స్వయంవరం' చిత్రం లండన్ చిత్రోత్సవంలో ప్రదర్శింపబడిన శుభసందర్భంలో, చలం—శారద అందులో పాల్గొన్నడం జరిగింది. దంపతులిద్దరూ పారిస్, రోమ్స్



'దేశోద్ధారకులు'లో రామారావు, వాణిశ్రీ.

# సినిమా

ఇటలీ నగరాలను వీక్షించడం జరిగింది. లండన్ పర్యటన తమకొక మధురానుభూతిని కలిగించింది, అన్నారు చలం, శారదలు.

చలం శారదలు నటజీవితంలో తమ ప్రత్యేక ప్రజ్ఞాప్రభావాలను చూపెడుతూ, ఆంధ్ర ప్రేక్షకులకు అభిమానపాత్రులయ్యారు. వీరిద్దరూ సినిమాల్లో కలిసి నటించక పోవడమే, వీరి విజయ రహస్యానికి కారణం.

*హిందీ అవకాశాలు !*

ఎన్నో వస్తున్నాయి, శారదకు. కానీ ఆమె అన్నింటిని ఒప్పుకుంటుందా? అలా చేస్తే, తెలుగు, తమిళ, మళయాల నిర్మాతలు ఏం కావాలి? అందుకే మంచి కధగావుండి, తనకు నచ్చినపాత్ర అయితేనే అంగీకరిస్తుంది.

ఇటీవల ఆమె హిందీలో అంగీకరించిన చిత్రం ఒకే ఒక్కటి. ఆ చిత్రం పేరు 'మృత్యులూండ్.'

## విజయా ప్రొడక్షన్స్‌లో శోభన్‌బాబు

'ఈ సంస్థలో నేను నటించడం అమందానందంగా వుంది'. అన్నారు శోభన్.

'అనేక విజయవంతమైన చిత్రాలకు సృష్టికర్తలయిన నాగిరెడ్డి—చక్రపాణిగార్ల చిత్రంలో నటించే అవకాశం రావడమే మహా అదృష్టంగా భావిస్తున్నాను' అన్నారు శోభన్. ఈ చిత్రానికి తాపీచాణక్య దర్శకుడు. మాటలను డి. వి. నరసరాజు, సంగీతాన్ని రమేష్‌నాయుడు నిర్వహిస్తున్నారు.

*రెండు పాత్రల్లో వాణిశ్రీ*

'విజయా ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రంలో నాకు ద్విపాత్రాభినయం చేసే అవకాశం లభించింది', అంది మేటినటి వాణిశ్రీ.

*కృష్ణ నటిస్తున్న విజయా ప్రొడక్షన్స్*

'విజయాధినేత నాగిరెడ్డిగారు పిలిచి నాకు వారి చిత్రంలో వేషం వుంది అని చెప్పినప్పుడు, నేనెంతగానో సంతోషపడ్డాను. విజయా సంస్థలో నటించడాన్ని నా అదృష్టంగా భావిస్తున్నాను', అన్నారు హీరో కృష్ణ.

*దక్షిణ భాషల హక్కులు!*

సిప్పీ ఫిలింస్ హిందీలో నిర్మించిన 'సీతా అవుర్ గీతా' చిత్రంయొక్క దక్షిణ భాషల హక్కులు. విజయా ప్రొడక్షన్స్ వారివద్ద వున్నాయి. ఈ చిత్రంలో హేమమాలిని ద్విపాత్రాభినయం చేసింది.

## మంచివాళ్లకు—మంచివాడు

'మోసగాళ్ళకు—మోసగాడు, పండంటి కాపురం' చిత్రాల విజయసారధి అయిన హీరో కృష్ణ సమర్పించే మరొక అపూర్వ చిత్రరాజమే 'మంచివాళ్ళకు — మంచివాడు' ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మితమైన ఈ చిత్రానికి కె. ఎస్. ఆర్. దాసు దర్శకుడు.

'దానవులుగా మారిన కొందరు మానవులు, మారణాయుధాల బలంతో నిరాయుధులైన ప్రజలపై దురాక్రమణ జరిపి, వారి ధన, మాన, ప్రాణాలను బలిగొన్న గాధలు చరిత్రలో కొల్లలు.

అందుకు వుదాహరణ యిటీవలి బాంగ్లాదేశ్.

మానవత్వాన్ని మట్టిపాలు చేసే దానవులు అన్ని కాలాల్లో వుంటూనే వున్నారు.

ఒక గ్రామంగ్రామాన్ని మొత్తం దయా, దాక్షిణ్యాలు లేకుండా నానా భీభత్సం చేసిన దానవసమూహాన్ని ఎదిరించి, ఓడించిన ఒక సాహసవీరుని వీరోచితగాథే మంచివాళ్ళకు మంచివాడు' ఈ చిత్రానికి పద్మరాజు — అప్పలాచార్య మాటలను, సత్యం సంగీతాన్ని సమకూర్చారు. నాయకీ, నాయకులుగా విజయనిర్మల, కృష్ణ నటించ, ముఖ్య పాత్రలను నాగేష్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, విజయశ్రీ, హలం పోషించారు. పూర్ణా విడుదల.

## సాతనూరులో కృష్ణ—చంద్రకళ

'నవచిత్రవారి అవుట్‌డోర్ షూటింగు సాతనూరులో జరిగింది. ఈ షెడ్యూలు రెండురోజులు సాగింది. కృష్ణ—చంద్రకళ పాల్గొన్న పాటను, మరికొన్ని దృశ్యాలను చిత్రీకరించడం జరిగింది' అన్నారు దర్శకుడు మల్లికార్జునరావు.

ఈ చిత్రానికి రాజశ్రీ రచన్ను, ప్రకాష్ ఛాయను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు.

'పిల్లలు భగవత్ స్వరూపులు' అన్న కధాంశంగొన్న ఈ చిత్రం తమిళంలో బహుళ ప్రజాదరణ పొందింది. ఆ చిత్రం పేరు 'కనిముత్తు పాపా' కానీ, తెలుగు చిత్రంలో అనేకమైన మార్పులుచేస్తి



'స్త్రీ'లో చంద్రకళ(లు)

మెరుగులు దిద్దడం జరిగింది, అని తెలుసుకున్నాను.

*జమున - చంద్రకళ :*

పై చిత్రంలో కృష్ణకు యిద్దరు నాయికలు వున్నారు. ఆ పాత్రలను జమున, చంద్రకళ పోషిస్తున్నారు. ప్రధాన భూమికలను రామకృష్ణ, త్యాగరాజు, కె. వి. చలం, విజయభాను ధరిస్తున్నారు. ఈ చిత్రం నవయుగద్వారా విడుదలవుతుంది.

## రా మ రా జ్యం

రామవిజేతా సోదరులు నిర్మించిన చిత్రం యిది. లోగడ వీరి చిత్రాలకన్నా మిన్నగా వచ్చిందీ చిత్రం. ఈ చిత్రంలో న్యాయం, ధర్మం, నిజం ముఖ్యపాత్రదారులు. మనిషి యొక్క గౌరవమర్యాదలను, సాంఘిక విలువలను పెంచేవి ఈ మూడేనన్న నగ్న సత్యాన్ని అత్యద్భుతంగా చూపెట్టగలిగారు, యువదర్శకుడు బాబురావు. ఈ లక్షణాలను గొన్న పాత్రలను ఎస్వీరంగారావు, జగ్గయ్య, గుమ్మడి పోషించారు.

రామవిజేతావారి చిత్రాల్లో కావలసినంత కధ వుంటుంది. కధా పాత్రలకు సరితూగే నటీనటులను ఎన్నుకునే అలవాటు వీరికి వుంది. వారి ప్రతిభని వినియోగించుకోనే విజ్ఞత బాబురావుకు వుంది. 'రామరాజ్యం' చూస్తే, నిజం మీకే తెలుస్తుంది.

అసభ్యత లేదు ... అశ్లీలత కనిపించదు, 'రామరాజ్యం'లో. చిత్రం చూస్తుంటే నేటి సమాజాన్ని, దర్శకుడు ఎంత చక్కగా చిత్రీకరించాడు! అన్న భావం వుత్పన్నం అవుతుంది.

ఈ చిత్రంద్వారా ఒక నాయకుడ్ని పరిచయం చేస్తున్నారు. అతడికి ఎంత శిక్షణ నిచ్చారో, చిత్రం చూసినప్పుడు అర్ధమవుతుంది. సాంఘిక కధల్లో ఎంతో వెరైటీ వున్న చిత్రంగా దీన్ని పేర్కొనవచ్చు. ఈ చిత్రాన్ని లక్ష్మి విడుదల చేస్తారు.

*మూడు చిత్రాలు :*

'రామరాజ్యం' విడుదల అయ్యేది, ఫిబ్రవరిలో. జనవరి మొదటి వారంలోగా రీ—రికార్డింగు పూర్తవుతుంది' అన్నారు నిర్మాత ప్రభాకర్.

మూడు బయటి చిత్రాలను ఒప్పుకున్నాను, అన్నారు దర్శకుడు బాబురావు. బహుశా ఫిబ్రవరిలో షూటింగు ప్రారంభం అవ్వొచ్చు, అన్నారు.

*స్క్రిప్టు రెడీ :*

'లైలా—మజ్ను' స్క్రిప్టు రెడీ అయింది. పినిశెట్టి మాటలను వ్రాస్తున్నారు. ఈ చిత్రం ఈస్ట్మన్ కలర్లో నిర్మించబడుతుంది, అన్నారు 'రామరాజ్యం' సోదరులు.

## 24 రోజుల షూటింగు

అన్నపూర్ణా సినీ ఎంటర్ప్రైసెస్‌వారి 'శారద' షూటింగు ఏకదమ్మున 24 రోజులు జరిగింది. రాజమండ్రి సమీపాన వున్న ఇనగంటివారిపాలెంవద్ద జరిగిన ఈ షెడ్యూలుతో షూటింగు పూర్తయింది. ఇందులో శోభన్, శారద, సత్యనారాయణ, రాజబాబు, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు పాల్గొన్నారు. పి. రాఘవరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు. మాటలను బొల్లిముంత, సంగీతాన్ని చక్రవర్తి, ఛాయను జి. కె. రాము, కళను కుదరవల్లి నిర్వహిస్తున్నారు. ముఖ్య పాత్రలను జయంతి, డాలీ ధరిస్తున్నారు. జ్యోతీ విడుదల.

## తాతా—మనవడు !

ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ నిర్మించిన ప్రబోధాత్మక చిత్రమే 'తాతా—మనవడు.' క్రైం చిత్రాలను నిర్మించడంలో ప్రత్యేకత వున్నవాడు రాఘవ అన్న యిదే పరిశ్రమ 'తాతా—మనవడు' చిత్రాన్ని చూస్తే ఏమంటారో తెలుసా? ఇంత గొప్ప కధ యితనికి ఎలా దొరికింది? అని విస్తుపోతారు.

'మన సమాజం రానురాను దిగజారిపోతూ వుంది. మమతానుబంధాలకు విలువ నీడ లేకుండా పోతూ వుంది. తల్లిని, తండ్రిని పూజించి, గౌరవించే వ్యక్తులు తక్కువగా కపిస్తున్నారు, 'వనితా వ్యామోహంలో పడి, కన్నతల్లి, తండ్రులను విస్మరించి, అవమానపరచిన ఒక యువకుడికి, అతడికి పుట్టిన కుమారుడు బుద్ధిగరిపిన కధనమే 'తాతా—మనవడు' చిత్రకధ. కధను, మాటలను, సినిమా అనుకరణను ఎవరయితే వ్రాశారో, వారే దర్శకత్వం వహించడం సమంజసం అని ఎంచారు, నిర్మాత రాఘవ. ఈ బాధ్యతలను దాసరి నారాయణరావు సమర్ధనీయంగా నిర్వహించారు.

తాతగా ఎస్వీరంగారావు, ఆయన కుమారుడిగా సత్యనారాయణ, మనవడిగా రాజబాబు నటించారు. విజయనిర్మల, గుమ్మడి ధరించిన పాత్రల్లో వైవిధ్యం వుంది. మిగతా పాత్రలను అంజలీదేవి, రేణుక, రాజసులోచన పోషించారు. ఈ చిత్రానికి రమేష్‌నాయుడు సంగీతసారధి. తారకరామ విడుదల.



'నేరము—శిక్ష'లో కుమారి వరలక్ష్మి, బాలయ్య.

## కృష్ణ చిత్రంలో రమేష్

పద్మాలయా కంబైన్స్ నిర్మించబోయే సాంఘికచిత్రం ఫిబ్రవరిలో సెట్స్‌కి వెళ్తుంది, అన్నారు హీరో కృష్ణ.

'ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మితమయ్యే ఈ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు. మాటలను మోదుకూరి జాన్సన్ వ్రాస్తున్నారు. సంగీతాన్ని రమేష్‌నాయుడు నిర్వహిస్తారు', అన్నారు పబ్లిసిటీ ఆఫీసరు మోహన్‌కుమార్.

## నేరము — శిక్షలో

## కృష్ణ — భారతి

నటుడు బాలయ్యకు స్వంతమైన అమృతాఫిలింస్ 'నేరము — శిక్ష' చిత్రాన్ని నిర్మిస్తున్న విషయం పాఠకులకు తెలుసు, ఈ చిత్రం షూటింగు చకచకా సాగిపోతూంది. కథను బాలయ్య వ్రాయ, మాటలను జాన్సన్ సమకూర్చారు. ఈ చిత్రానికి రాజేశ్వరరావు సంగీతాన్ని, యోగానంద్—రామచంద్రయ్య ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

'నేరము—శిక్ష'లో కృష్ణ, భారతి ప్రధాన జంటగా నటిస్తున్నారు. ముఖ్యపాత్రలను బాలయ్య, సత్యనారాయణ, కాంతారావు, సూడా, కృష్ణకుమారి, పండరీబాయి, వరలక్ష్మి పోషిస్తున్నారు. కె. విశ్వనాథ్ దర్శకత్వంలో సింగారించుకుంటున్న ఈ చిత్రం నవయుగా ద్వారా విడుదలవుతుంది.

## దేశోద్ధారకులు

'మంచి చిత్రం తీయాలి; మంచిపేరు రావాలి' అన్న తలంపువున్న ఉత్తమ నిర్మాతల్లో విశ్వశాంతి విశ్వేశ్వరరావు ఒకరు. దీప్తి యింటర్నేషనల్ బ్యానర్‌పై ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'దేశోద్ధారకులు' చిత్రం, తెలుగులో 'కాస్ట్‌లియస్ట్' అని చెప్పక తప్పదు. ఈ చిత్రానికి సుమారు 30 లక్షలు ఖర్చయినట్లు తెలిసింది. ఈ చిత్రానికి సి. ఎస్. రావ్ దర్శకుడు. మాటలను మహారథి, జాన్సన్ వ్రాశారు. ఛాయాగ్రహణాన్ని బి. కె. రాము, సంగీతాన్ని మహదేవన్, కళను కృష్ణారావు నిర్వహించారు.

'ఏదో ప్రగతిని సాధించాము అనుకునే నేటి సమాజంలో రోజూవారీ మనం చూస్తున్నదీ, వింటున్నదీ రెండేరెండు.

ఒకటి : నవ్వుల పేదరికంలోని విషాదగాథ.

రెండు: కృత్రిమ సంపదలోని విషాలగాథ' ఈ రెండు కథలసారాంశమే మా చిత్రం, అన్నారు విశ్వేశ్వరరావు.

*ఫిబ్రవరి 2 న వస్తారు!*

'దేశోద్ధారకులు' ఫిబ్రవరి రెండున విజయా పంపిణీ సంస్థద్వారా పర్యటన ప్రారంభిస్తారు. ఈ చిత్రంలో ఎన్టీరామారావు, వాణిశ్రీ, నాగభూషణం, సావిత్రి, పద్మనాభం, సంధ్యారాణి ముఖ్యపాత్రధారులు.

## జయకుమారి వలలో

## ప్రకాష్ పడ్డాడా?

అందమే ఆనందం అంటారు కొందరు. ఆ అందమే సృష్టికంతటికి మూలం అంటారు మరికొందరు. అదే పడుచు గుండెలకు గాలం అంటారు మరెందరో.

ఎందరో మహానుభావులు ఆడదాని ఓరచూపులకు, వంపుసొంపులకు తలవొగ్గారు. విశ్వామిత్రుడు అంతటివాడే...

వెదురైనా పొడగిలిగితే వేణువవుతుంది. గవ్వయినా ఆడగలిగితే మువ్వ అవుతుంది. కొండయినా తొలచగలిగితే కోవెలవుతుంది. ఈ నిజాన్ని గుర్తుచెయ్యవచ్చింది ఒక వనిత. ఆ ఘనత జయకుమారికి దక్కింది. నవయువ్వనుడు, సరికొత్త నాయకుడు అయిన ప్రకాష్‌పై ఓరచూపులు విసిరింది. మత్తుగా, గమ్మత్తుగా ప్రేమబాణం దూసింది. తన అందంలో అతడ్ని బందీ చేద్దామని విశ్వప్రయత్నం చేసింది ... కానీ అతడు తొణకలేదు...సరికదా ఆమె వలలో చిక్కలేదు...మరి జయకుమారి స్థితిగతులు ఎలా పరిణమించాయి? అది చూడవలయునన్న ఉషశ్రీవారి 'ప్రేమపక్షులు' రావాలి. మార్చిదాకా ఓపిక పట్టండి. ఈ చిత్రానికి పి. చిన్నపరెడ్డి దర్శకుడు. అనిల్ ప్రభాస్ ద్వారా నవయుగ విడుదల.



'నిండుకుటుంబం'లో విజయలలిత

## కొత్త చిత్రంలో

## కృష్ణకుమారి

సూర్యా ఆర్ట్ పిక్చర్స్ జనవరి చివరి వారంలో కొత్త చిత్రం షూటింగ్ ప్రారంభిస్తారు. ఈ చిత్రానికి పిళ్లారిశెట్టి దర్శకుడు.

ఇతగాడి పేరు పి. కె. రామారావు. చిత్ర రంగంలో దర్శకత్వ శాఖలో అనుభవం గడించిన యువకుడు. లోగడ భాస్కర్ పిక్చర్స్‌లో పనిచేశాడు. మొదటిసారిగా దర్శకత్వాన్ని చేపటాడు. యిప్పుడు ఈ చిత్రానికి దత్తాత్రేయశర్మ మాటలను వ్రాస్తున్నారు. సూరవరపు వెంకటేశ్వరరావు నిర్మాణ వ్యవహారాలను నిర్వహిస్తున్నారు. కృష్ణకుమారి ఒక ముఖ్య భూమికను ధరిస్తుంది.

## శ్రీవారు — మావారు!

మహావిష్ణు ప్రొడక్షన్‌వారి 'శ్రీవారు—మావారు' షూటింగు పూర్తయింది. బి. వి. ఎస్. నారాయణ దర్శకత్వంలో నిర్మితమైన ఈ చిత్రానికి బొల్లిముంత మాటలను, వెంకటేష్ సంగీతాన్ని, రామకృష్ణారావు ఛాయను నిర్వహించారు. కృష్ణ, వాణిశ్రీ, కృష్ణంరాజు, పద్మనాభం, అంజలీదేవి, రాజసులోచన, గీతాంజలి, రామమోహన్, నాగభూషణం ముఖ్య పాత్రధారులు. ఫిబ్రవరిలో పూర్ణా ద్వారా విడుదలవుతుంది.

## జీవనతరంగాలు

రావుగారి కూతురిని, లాయర్ విజయ్ తమ్ముడు అనంత్‌కి యిచ్చి వివాహం చెయ్యాలని, విజయ్, రావులు మాట్లాడు కుంటుండగా లావణ్య వచ్చి ఆ విషయాలు మాట్లాడవద్దని ఖచ్చితంగా చెప్పింది.

'అదికాదు లావణ్యా! తెలిసినవాళ్ళం ఒకళ్ళ నొకళ్ళు తెలుసుకొన్నవాళ్ళం రెండు కుటుంబాలు కలిస్తే బాగుంటుందని, మీరిద్దరూ ఈడూ జోడుగా వుంటారని మా ఆశ' అన్నాడు లాయర్ విజయ్.

'మీ ఆశకేం చాలా బాగుంది. నా ఆశతో మీకు సంబంధం లేదు. పోనీ అనంత్ ఆశ ఏమిటో కనుక్కున్నారా?' అంది వెటకారంగా లావణ్య.

'అనంత్ నా మాట కాదనడు. నేనెంత చెపితే అంతే' అన్నాడు విజయ్.

'ఓహో! అన్నగారి అడుగుజాడల్లో నడిచే లక్ష్మణుడా? ఆయన్ని చేసుకుంటే నేను ఊర్మిళలా నిద్రపోవల్సిందేగా? నేను ఆ పిల్లను—నాక్కొంచెం వ్యక్తిత్వం వుంది' అంది.

'లావణ్యా!' గద్దించాడు తండ్రి రావుగారు.

తండ్రి మాటలు లెక్కపెట్టకుండా.

'నేను క్లబ్‌కి వెళుతున్నాను మీరు నా పెళ్ళి సంగతి మానేసి వేరే ఏదైనా ఆలోచించండి మీ ఆరోగ్యానికి మంచిది' అని తెల్లబోయి చూస్తున్న తండ్రిని, విజయ్‌ను వదలి చరచరా వెళ్ళిపోయింది.

ఈ సన్నివేశం సురేష్ మూవీస్‌వారి 'జీవన తరంగాలు' చిత్రంలోనిది. తాతినేని రామారావు దర్శకత్వం నెరపుతున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు, గుమ్మడి, కృష్ణంరాజు, పద్మనాభం, చంద్రమోహన్, రావికొండలరావు, వాణిశ్రీ, లక్ష్మి, సూర్యకాంతం మున్నగువారు ముఖ్య భూమికలను పోషించారు. రామానాయుడు నిర్మిస్తున్న ఈ చిత్రానికి మాటలను పినిశెట్టి, కెమెరాను యస్. వెంకటరత్నం, సంగీతాన్ని రాఘవులు, కళను యస్. కృష్ణారావు ఎడిటింగ్‌ను మార్తాండ్ నిర్వహించే బాధ్యతలను చేపట్టారు. నవయుగ విడుదల.

## తెలుగులో పునర్జన్మం

మలయాళంలో నిర్మించబడిన 'పునర్జన్మం' విజయఢంకా మ్రోగించి, బహుళ ప్రజాదరణను బడసింది. ప్రస్తుతం అదే చిత్రాన్ని తెలుగులో శ్రీ కాళేశ్వర ఎంటర్‌ప్రైజస్‌వారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్నారు.

పరిస్థితుల ప్రభావం వల్ల నాయికీ నాయకుల మధ్య జరిగే మానసిక సంఘర్షణ ఏ రూపం దాలుస్తుందో అన్న ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకొని నిర్మించబడుతున్న సంచలన చిత్రం ఇది.

బాక్సాఫీసు దర్శకుడు బాపు దర్శకత్వంలో వెలువడిన చిత్రాలన్నింటికి అసోసియేట్‌గా పనిచేసి, అపార అనుభవాన్ని గడించిన పి. యన్. బోస్ ఈ చిత్రానికి దర్శకుడు.

అతి త్వరలో సెట్స్‌మీదకు వెళ్ళనున్న ఈ చిత్రానికి మూల కథను ఎ. టి. కోవూరు వ్రాయ, సంగీతాన్ని పుహళేంది, కళను కళాధర్, కూర్పును సంజీవి నిర్వహిస్తారు.

## విజయదుర్గ ప్రొడక్షన్స్

విజయదుర్గ ప్రొడక్షన్స్ పతాకం క్రింద తోట సుబ్బారావు సమర్పించు ఒక చక్కని సాంఘిక చిత్రనిర్మాణానికి సర్వసన్నాహాలు శరవేగంగా సాగుతున్నాయి. ఇప్పటికి నాయిక, నాయక పాత్రలను వాణిశ్రీ, కృష్ణలను నిర్ణయించటం జరిగింది. అతి త్వరలో ముఖ్యమైన తారాగణంతో 'సెట్స్' మీదకు వెళ్ళనున్న ఈ చిత్రానికి పాలగుమ్మి పద్మరాజు సంభాషణలను, మహాదేవన్ సంగీతాన్ని, సి. యస్. రావు దర్శకత్వాన్ని నిర్వహిస్తారు. చిట్టూరి గాంధి నిర్మాణ నిర్వహణలో రూపొందుతున్న ఈ చిత్రానికి నిర్మాత టి. రామకోటేశ్వరరావు.

## పాత్రికేయులతో కలం

ఊర్వశి శారదను, 'ఊరికి ఉపకారి' నాయకుడు చలంను గూర్చి తెలియని వారుండరు. భార్యా భర్తలిద్దరూ మొదట్లో వెయ్యడం నాయిక, నాయక వేషాలను వేసినప్పటికీ, కాలం కల్సిరాక కొన్నాళ్ళు కను



'రామరాజ్యం'లో చంద్రకళ, రంగారావు.

ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥





# సినిమా

మరుగున పడడం జరిగింది స్వయం కృషి, స్వయం ప్రతిభపై సంపూర్ణ విశ్వాసం గల చలం స్వంత నిర్మాణ సంస్థను నిర్మించి, కథానాయకుడిగ నటించి, సంచలన నటుడు చలం అన్న పేరును సంపాదించ గల్గాడు. మలయాళం 'మనుషులు మారాలి' విజయం సాధించడంతో, పరిశ్రమ, ప్రేక్షకుల దృష్టిలో పడింది శారద పరిపూర్ణమైన నటన. ఇలా ఇరువురు పేరు ప్రఖ్యాతులతో పెరిగి పెద్దవారై అగ్రశ్రేణి తారల జాబితాలో చేరిపోయారు.

శారద నటించిన 'స్వయం వరం' చిత్రం లండనులో ఫిలిం ఫెస్టివల్ లో ప్రదర్శింపబడుతున్న సందర్భంగా, ఆ దేశ ప్రజలు ఆవిడను ఆహ్వానించారు వారి ఆహ్వానాన్ని మన్నించి పయనమయ్యారు భార్యాభర్తలు శారద చలంగార్లు.

వారి విదేశయానానికి ముందు పత్రికా విలేఖర్లు వారికిచ్చిన విందు సందర్భంలో చలం మాట్లాడుతూ 'జర్నలిస్టులను కలవాలి, కలవాలి అనుకొన్న నా కల ఇన్నాటికి అంటే 1973 నాటికి నిజమైంది. కల్సుకొని కలుపుగోలు తనంగా మాట్లాడుకొనే భాగ్యం కల్గింది అన్నారు.'

చార్లీచాప్లిన్‌గార్ని కల్సుకోవడం మర్చిపోకండి అన్న నాతో 'తప్పకుండా కల్సుకుంటాను కల్సుకోవాల్సిన అవసరం ఎంతేని వుంది కారణం వారు తీసిన 'సిటీలైట్స్' ప్రస్తుతం ఫల్గుణావారు తియ్యడం, అందులో నేను నాయకుడిగా నటించడం జరుగుతోంది.'

'లండను' సినీ పరిశ్రమ ఎలా పురోగమిస్తున్నది, నటీనటులవలంబిస్తున్న సూత్రాలు సూచనలెలాంటివి, నిర్మాతలు, దర్శకులు, సాంకేతిక నిపుణులు ఆచరిస్తున్న క్రొంగ్రొత్త మార్గాలు, నాటకాలు ఏ స్థితిలో వున్నాయి మున్నగు పెక్కు ఆసక్తికరమైన అంశాలను అందరూ కళ్ళారా చూడ్డానికి, వీలైనంతగా వినడానికి సాయశక్తులా ప్రయత్నిస్తాము వారి పరిశ్రమను గూర్చి మనం తెల్సుకుంటే చాలా! మన దక్షిణ భారత సినీ పరిశ్రమను గూర్చి వారికి చెప్పడం మా ప్రధానమైన కార్యక్రమాలలో ఒకటిగా భావిస్తాము తిరిగొచ్చాక మళ్ళీ కలుస్తాము' అని చెప్పి ముగించారు చలం.

## పండంటి కాపురం రజతోత్సవం

జనవరి 6వ తేదీ సాయంత్రం 6 గంటలకు విజయా నందనోద్యానవనం రంగురంగుల విద్యుద్దీపాలతో, బారులు తీరిన కారులతో అలంకరించి 3 కేంద్రాలలో (విజయవాడ, విశాఖపట్నం, హైదరాబాదు) 25 వారాలు జయప్రదంగా ప్రదర్శింపబడిన జయ్యంద పిక్చర్సు వారి 'పండంటి కాపురం' రజతోత్సవం ఈ నేత్రపర్వమైన ఉత్సవానికి వాహిని స్టుడియో అధిపతి, దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి అధ్యక్షులు అయిన శ్రీ నాగిరెడ్డిగారు అధ్యక్షత వహించగా, ప్రఖ్యాత హిందీతార పద్మశ్రీ వహీదా రహమాన్ బహుమతి ప్రదానం చేయడానికి బొంబాయి నుండి విచ్చేసింది

అల్పాహార విందు అనంతరం ఆరుద్ర స్వాగత వచనాలతో గంధర్వగాన శిఖామణి ఘంటసాల ప్రార్థనాగీతంతో కార్యక్రమం ప్రారంభమైంది.

దాశరథి మాట్లాడుతూ 'పండంటి కాపురం' చిత్ర సారధి అయిన కృష్ణను, అతను సాహసంతో తీసిన చిత్రం విజయవంతమైనందుకు తన అభినందనలు తెలియచేసారు శ్రీమతి జమున ప్రసంగిస్తూ, 'ఈ చిత్రం విజయవంతం కావడానికి ఏ ఒక్కరూ కారణభూతులుకారు అన్న విషయంలో తాను ఏకీభవించననీ, పటిష్టమైన కథకు, అందులోని పాత్రలను ప్రతిభావంతంగా పోషించగల్గిన నటీనటుల ఎన్నిక తోడైనపుడే ఆ చిత్రం విజయాన్ని సాధించగల్గుతుంది. మన నిర్మాతలు ఎందుకారణంగానో శత దినోత్సవ పండుగలను చేయడంలేదు. ఇలాంటి వుత్సవాలు జరిపినప్పుడు ఆ చిత్రంలో పాల్గొన్న ప్రతి ఆర్టిస్టుకు (వేషం చిన్నదైనా) మున్ముందు ఇంకా బాగా నటించి, ఇలాంటి వుత్సవాల్లో పాల్గొనే అవకాశాన్ని పొందాలి అన్న భావం గల్గుతుంది' అన్నది, వహీదా తనకు ఇలాంటి సంతోష సంబ

రంలో పాల్గొనే అవకాశాన్ని కల్గించిన హీరో కృష్ణకు కృతజ్ఞత లర్పించింది.

పూర్ణా ఫిలింస్ అధినేత కామరాజుగారు కృష్ణ సాధించిన విజయానికి తన అభినందనలు తెలియచేసి, ఇకముందు తీయనున్న చిత్రాలుగూడ విజయవంతం కావాలని దీవించారు.

వయస్సులో చిన్నవాడైనా, ఒక నిర్మాతగా, ఒక నటుడిగా హీరోకృష్ణ తన మనస్సులోని మాటలను నిర్మొహమాటంగా చెప్పారు.

'ఏ ఒక్కరివల్లా ఏ ఒక్కచిత్రం విజయవంతం చేయడం సాధ్యంకాదు. బాధ్యులు కాలేరు. మంచి కధ దొరకాలి; పాత్రలకు సరియైన నటీనటుల ఎన్నిక జరగాలి; నటీనటుల హావభావాలు బాగుండాలి; అందరూ, అన్నీ సక్రమంగా నిర్వర్తించినా, కూర్పు సరిగా వుండాలి; ఇంతవరకు నిర్మాత బాధ్యత. అంతటితో తనపని అయిపోయిందనుకుంటే అయిపోదు. పంపిణీదారులు సరి అయిన సమయంలో విడుదల చేయాలి; ఎలాంటి చిత్రాన్ని అయినా ఎదుర్కొని నిలబడగల్గిన స్థోమత వుండాలి; అంతకుమించి ప్రేమకుల ఆదరాభిమానాలు లభించాలి ఇంత తతంగం జరిగితేగాని ఆ చిత్రం విజయవంతం కాదు. ఇవన్నీ నా చిత్రానికి కల్సి రావడం, ప్రజల ఆదరం, ఆశీస్సులభించడం నా అదృష్టం' అంటూ తన కోర్కెను మన్నించి విచ్చేసిన ఆహూతులందరికి ధన్యవాదాలర్పించారు.

కళావాచస్పతి జగ్గయ్య చిత్ర కథకుడు ప్రభాకరరెడ్డిని, తోటి నటుడు కృష్ణను అభినందించి, చిత్రంలో తమకు అనుభూతులను గల్గించిన సన్నివేశాలను నెమ్మదిగా వేసారు. జమునగారి సందేహాన్ని నివృత్తి చేస్తూ, 'మన నిర్మాతలు శతదినోత్సవాలు జరుపక పోవడానికి విజయవంతమవుతున్న చిత్రాల సంఖ్య తక్కువగా వుండడం, ఒకవేళ విజయాన్ని సాధించినా ఖర్చు పెట్టి వుత్సవం జరిపించడం నిర్మాతలకు ఇష్టం లేక పోవడమే కారణాలు' అన్నారు.

సభాధ్యక్షులు శ్రీ నాగిరెడ్డిగారు తన మలిపలుకులు మాట్లాడుతూ—'పండంటి కాపురం' చిత్ర విజయం మన చిత్ర పరిశ్రమ అంతటికి గర్వించ దగ్గ విషయం. అయిడియలిజమ్ + రియలిజమ్ సమపాళ్ళలో సమ్మిళితమైన సంసారపక్షమైన కథ ఇది. ఇలాంటి భారీఎత్తు చిత్రాన్ని 90రోజులలో పూర్తి చేసిన యువదర్శకుడు లక్ష్మీదీపక్‌ను, తీసిన కృష్ణను, సహకరించిన నటీనటులను అభినందించారు. ఇలాంటి వుత్సవాలు జరిపి, భావి నిర్మాతలకు మార్గదర్శకులు కావాలన్నారు. దిన దినానికి నిర్మింపబడే చిత్రాల సంఖ్య పెరుగుతున్న కొద్దీ, వసూళ్ళు తగ్గిపోతున్నాయి. ఈనాడు ఒక చిత్రం వంద రోజులు ఆడిందంటే నిర్మాత పెట్టుబడి డబ్బులు వచ్చాయనే. ఒకవేళ ఏ కాస్తో కూస్తో లాభం వచ్చినా, (అందరికీ అన్నీ పోగా) ఇలాంటి పండుగలు జరిపితే నిర్మాతకు మిగిలేదంటూ ఏమీ వుండదు' అని చెప్పారు.

పద్మశ్రీ వహీదారహమాన్ ఈ చిత్రంలోని నటీనటులకు, సాంకేతిక నిపుణులకు, డిస్ట్రిబ్యూటరుకు, నిర్మాతకు, థియేటరు యజమాన్లకు షీల్డులను బహూకరించింది. ఈ శుభసందర్భంలో జయప్రద యూనిట్‌కు 3 నెలల బోనసును, 25 వారాలు ప్రదర్శింపబడిన థియేటర్లలోని పనివాండ్రకు 3 నెలల బోనసును, వందరోజులు ప్రదర్శింప బడుతున్న బెంగుళూరు థియేటరులోని వర్కర్సుకు 1 నెల బోనసును ఇస్తున్నట్లు ప్రకటించారు హీరో కృష్ణ.

ఈ వుత్సవానికి పద్మశ్రీ, నటరత్న రామారావు, చక్రపాణి, పి. పుల్లయ్య, భావనారాయణ, డి. రామానాయుడు, మరెందరో సినీ ప్రముఖులు, పాత్రికేయులు, ప్రజలు విచ్చేసి రజతోత్సవ పండుగను సుఖాంతం చేసారు.

## పాడిపంటలు

'అగ్నిపరీక్ష', 'మోసగాళ్ళకు మోసగాడు' చిత్రాలను నిర్మించిన శ్రీ పద్మాలయా మూవీస్ దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి వ్రాసిన రైతు జీవితానికి సంబంధించిన కధను చిత్రంగా నిర్మించడానికి నిర్ణయించారు. ఈ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తారు. మొట్ట మొదటిసారిగా ఆచార్య ఆత్రేయ ఈ సంస్థకు మాటలు వ్రాస్తున్నారు. దర్శకత్వాన్ని పి. చంద్రశేఖరరెడ్డి, సంగీతాన్ని మహాదేవన్, నిర్వహిస్తారు.

తెలుగుతెర హేమాహేమీలందరూ ఇందులో ముఖ్య పాత్రలను ధరించగలరని హీరో కృష్ణ చెప్పారు.

—శ్రీనివాస్ ●



'పండంటి కాపురం' రజతోత్సవ సందర్భములో జమున, వహీదా, పూర్ణా కామరాజు,

15—12—72 సంచికలో "ఉత్తరాలు"లో పి. రామకృష్ణ (తిరుపతి) వారి ఉత్తరము ఎంతో సమంజసముగా యున్నది. వారు సూచించినట్లు 'సుప్రీంకోర్టు' తీర్పు ఒక టెక్నికల్ అంశము మాత్రమే.

ఆంధ్రులు కరుణతో పుట్టారు!!!
ఆంధ్రులు కరుణ వడిలో పెరిగేవారు!!!
ఆంధ్రులు కరుణలోనే జీవిస్తారు ! ! !

ఆంధ్రులకు 'కల్ల' తెలియదు
ఆంధ్రులకు 'వెన్నుపోడవటం' తెలియదు! ! !
న్యాయం ఆంధ్రుల సొత్తు
అందుకే నేటి పరిస్థితి యింత . . .నమ్మరు!!

మరి, ఆంధ్రులు వెనకబడ్డవాళ్ళే! ! !
ఉభయ గోదావరి జిల్లాలు . . .
కృష్ణా, విశాఖ జిల్లాలు . . .
ఏం సాధించాయి ప్రగతిని ! ! !

'నిరుద్యోగులు' పెరుగు తున్నారు
నిస్పృహా జీవితాలు పెరుగు తున్నాయి ! ! !
పొరుగువాని యింట్లో పండుగ అంటే,
ఆంధ్రులకు సహించదా!!!

తమ యింట్లో పండుగ మరిచిపోతారు పాపం!!!
'నిజం' తెలిసింది ఆంధ్రులకు!!!
అందుకే కోరుతున్నారు!!!
ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం!!!
'న్యాయం' జిందాబాద్
'ధర్మం' జిందాబాద్
'మానవతా' జిందాబాద్.

కె. సుధాకరరావు, (రాయఘర్).

* * *

విశాఖపట్టణంలో ఉన్న కింగ్‌జార్జ్ ఆసుపత్రి యొక్క అభివృద్ధి గురించి ఒక ఆంధ్ర ప్రాంతీయుడు వాపోవుతూ తెలంగాణా ప్రాంతములో ప్రతి ఆసుపత్రి అభివృద్ధిలో వుందని వారి అభిప్రాయం. తమ నాయకులే తమకు న్యాయము చేస్తారని అనుకోకుండా ఇతరప్రాంతము వారిపై నిందలు వేయుట మంచిదికాదు. మీకు (ఆంధ్ర) తెలంగాణా వారిపై ఉన్న సదభిప్రాయము నకు నేను చాలా సంతోషించుచున్నాను.

"ఈ ఉత్తరం ప్రచురించబడదని నా అభిప్రాయము."

తాడూరి రామకృష్ణారావు (ఖమ్మం)

* * *

మీ పత్రికలో ఈ మధ్యన పబ్లిష్ చేయుచున్న వ్యాసాలు, అభిప్రాయాలు పూర్తిగా పక్షపాతంగా వున్నాయి. మీ పత్రిక కేవలం ఆంధ్రులదా? లేక తెలుగుభాష వారిదా? అర్థమవ్వడం లేదు. ఒకవేళ మీ పత్రిక తెలుగువారిదయితే మీకు తెలంగాణా మరియు ఆంధ్రులనే భేదభావాలు యుండకూడదు. మీ యొక్క వైఖరి ఏమి బాగు లేదు. ఈవిధంగా అయితే మీ పత్రికను మా తెలంగాణాలో 'బ్యాన్' చేయాల్సి వస్తుంది. ఇది దినపత్రిక కాదు.



# ఉత్తరాలు

## (4వ పేజీ తరువాయి)

వారపత్రిక—మరియు మ్యాగజైన్ అని మీరు గుర్తుంచుకోవాలి. జాగ్రత్త. ఇకముందు ఇలా జరుగ కూడదని ఆశిస్తున్నాము.

జి. విశ్వేషర్, ఆర్. వృద్వీధర్,. (జగిత్యాల)

* * *

8—12—72 ఆంధ్ర పత్రికలో శ్రీ ఎం.ఎం. రావ్‌గారి వ్యాసం సమంజసంగా ఉంది. (ప్రజలే నాయకులకి దారి చూపిస్తున్నారా?) రాజకీయ నాయకులు ఎప్పుడూ ప్రజలకి మార్గ దర్శకులుగా ఉండాలి. ప్రజాభిప్రాయం తీవ్ర రూపం దాల్చిన తర్వాత దాని వెంట కుంటుతూ నడవ కూడదు నాయకులన్నవారు. కానీ, ఇప్పటి మన నాయకుల పరిస్థితి, అలాగే ఉంది. అందువల్లనే ఆంధ్ర దేశంలో ఇలాంటి విషమ పరిస్థితి ఏర్పడిందని ఖచ్చితంగా చెప్పవచ్చు. మన వారు ప్రతి విషయానికి ఢిల్లీ వెళ్ళడం అలవాటై పోయింది. అలాగే ఈ సమస్యపై ఆంధ్ర దేశ నాయకులంతా మంతనాలు జరుపుతూవచ్చారు. ఈలోగా ఆంధ్రప్రాంతంలో పరిస్థితి ఉద్రుతమయింది 21—11—72 'బంద్' సందర్భంగా ఆంధ్ర ప్రాంతంలో మూడు చోట్ల కాల్పులు జరిగాయి. సి. ఆర్. పి. దళాలు విచక్షణా రహితంగా కాల్పులు జరిపారని, ప్రజా వాహిని ముక్త కంఠంతో చెబుతూంది. ఎందరో అమాయక ప్రజలు నిండుగా తమ ప్రాణాలను కోల్పోయారు. ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వం ఈ సి. ఆర్. పి. దళాలను రప్పించడం మిక్కిలి శోచనీయం. వీరిని వెంటనే తరలించుటకు మన నాయకులు చర్య తీసుకోవాలి.

ముల్కీ నిబంధనలను గురించి ప్రధాని చేసిన ప్రకటన న్యాయబద్ధమైనది కాదు. ప్రధానమంత్రి ఆంధ్రులపై చిన్న చూపు చూస్తున్నారనే దానికి ఇదొక చిన్న నిదర్శనం. ఈ విషయమై పలువురు ప్రముఖులు తమ అసమ్మతిని తెలియ జేశారు. సమ్మెలు, ఆందోళనలు, నిరాహార దీక్షలు, బంద్‌లు మొదలయ్యాయి. ఈ సమస్య ఇప్పు డిప్పుడే ముగిసేట్టు లేదు. మన నాయకులు కేవలం ఎక్కడి నుంచో ఒక ప్రకటన చేయడం వల్ల పరిస్థితులు సర్దుబాటు కావు. ఆందోళనలు జరుగుతున్నచోటుకి వెళ్ళి శాంతి ప్రబోధం చేయాలి. ఇదే ఇప్పటి తక్షణ కర్తవ్యం.

—ఎస్. ఏ. రావు, పార్లే, (ద్రోణాచలం)

* * *

ఆంధ్రులు ఎన్నటికీ ఒక అగ్రన్యాయస్థానాన్ని అగౌరవ పరచరు. కానీ వారి కనీస హక్కులకే ప్రతిఘటన కలిగించే ఏ న్యాయ (శాస్త్ర) స్థాన తీర్పును సార్థించలేరు. కనుకనే దాని సవరణ కొరకు, వారి నైతిక విలువలకు భంగం భంగం ఉండనట్టి పరిష్కార మార్గం కలిగేవరకు ఆంధ్రప్రజలు విద్యార్థులు దిగజారిపోకుండ ఉండగలరని ఆశిస్తున్నాను. 'ఆంధ్రులది ఆరంభ శూరత్వమే' అన్నట్లు చేయవద్దని నా మనవి. —కె. ఎస్. దేవి(మచిలీపట్నం)



## హైదరాబాద్ నోట్ బుక్

5—1—73 సంచికలో హైదరాబాద్ నోట్ బుక్‌లో రవాణామంత్రి శ్రీ కె. భాస్కరరెడ్డి అని రాశారు. బహుశా వారి ఉద్దేశం ప్రభాకర్ అన్నా భాస్కర్ అన్నా ఒకటే అని నమ్మి.

"భవాని" (హైదరాబాదు)

* జవాబు: రవాణామంత్రి శ్రీ ప్రభాకరరెడ్డి అన డానికి మారు, భాస్కరరెడ్డి అని పొరపాటు దొర్లింది.

—శి. రా.

## వ్యాసాలు

మీ పత్రిక (తేది 29—12—72) లో మధామగారి వ్యాసం చూశాక వ్రాయాలనిపించింది. ముల్కీ రూల్సు ములుకులు కాగ ముఖ్యమంత్రి గారు అయ్యో నే ఢిల్లీ వెడతానని అంటారు అన్నారు. అది నిజమే. "ముల్కీ" అన్న శబ్దానికి నిర్వచనం యేమిటి? ముల్కీ రూల్సు ఎలా వచ్చాయి ఎవరికి ఇవ్వబడ్డాయి? అన్నీ సాకల్యంగా తెలిసిన బుద్ధిమంతు లెవరూ తెలంగాణా ప్రజలకు మెరిట్ లేదు, స్పిరిట్ లేదు అని విమర్శించరు. 16 సం. లుగా ముల్కీ రూల్సును అమలు పరుచకుండా కొన్ని వేలమంది తెలంగాణా వాళ్ళ కడుపులు కొట్టి ఆంధ్ర ఉద్యోగులను నింపారన్నది చేదునిజం.

ఇక మీరు ప్రచురించిన లెక్కలు నేను నిజమని నమ్మినా తెలంగాణాలో ఎంతమంది ఆంధ్రులు ఉన్నత స్థానాల్లో ఉండి తెలంగాణావారిని రెండవ తరగతి పౌరులుగా జమకట్టు తున్నారన్నది మీరు కప్పి పుచ్చారు. మొత్తం ఆంధ్ర ప్రాంతంలో ఎంత మంది తెలంగాణా వారున్నారు (ఉద్యోగాల్లో) వాళ్ళు మీలాగే, ఆంధ్రులను రెండవ తరగతి పౌరులుగా చూస్తున్నారా. బ్యాక్‌వర్డ్‌నెస్ ఎంత కాలం అన్నారు కదా సమమైనంత కాలం. ఒక కమిటీని వేసి రెండు ప్రాంతాలు ఆర్థికంగా సమస్థాయిలో వున్నవా నిర్ణయించమనండి. అంత దమ్ము యెక్కడ? బొంబాయి అన్న వాళ్ళకు పుష్పక విమానాలు యెవరూ ఇవ్వడం లేదు. ఏంటిసురా, అన్నవాళ్ళకే అవి, ఇవ్వబడుతున్నవి. "తెలంగాణా రక్షణలు" వ్రాసిన వ్రాత తడి ఆరి ఆరకముందే మోసం చేశారు. ఎమ్. నారాయణరెడ్డిగారు పుస్తకాన్ని ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని కాంగ్రెస్‌వాదులే వెన్నుపోటు పొడిచారు. విద్యార్థులను ఒక విద్యా సం. ను వెనకపడేటు చేసారు. అదేవిధంగా మీ ప్రత్యేక రాష్ట్ర ప్రజాపరిషత్ అధ్యక్షులు మా వూరిలోనే ఆంధ్రులే తెలంగాణాకు అన్యాయం చేశారని సెలవిచ్చారు. (1969 లో). మరి ఇప్పుడు కొత్త రంగుమార్చి అటు వదాన్ని కొత్త ఇటు మార్చారు అంతే లేదా. ప్రత్యేక రాష్ట్ర వాంఛను మేము ఎలక్షన్లలో ఓటు చేసి చూపించాము. మీరు మీ కాంగ్రెస్‌వాదులు మీకే వెన్ను పొడవకుండా చూసుకొని ప్రత్యేక రాష్ట్ర వాంఛను సాధిస్తారని ఆశిస్తూ . . .

కె. అమర్‌నాథ్. (హైదరాబాద్)

5—1—73 సంచికలో ముల్కీసమస్యపై శ్రీ వైకుంఠం, మరో యిద్దరు కలసి తెలంగాణాకు చాలా అన్యాయం జరిగిందంటూ వాపోయారు. ముఖ్యమంత్రి 'పదేపదే సుప్రీమ్‌కోర్టు తీర్పును చిత్తశుద్ధితో అమలు జరుపుతాం' అని అన్నారట. కాదని ఎవరూ అనలేదే! ఆయన స్వతసిద్ధంగా అమలుజరిపే శక్తి ఉంటే యింత ఆలస్యం, అనర్థం ఉండకపోను 'తెలంగాణాకు అన్యాయం జరిగిందని అప్పటి మంత్రివర్గం ఒప్పుకున్నది' అన్నారు. మరి ఆ మంత్రివర్గంలో మా తెలంగాణా ప్రజలు ఎన్నుకున్న మంత్రులు లేరా? వాళ్ళపాత్ర యిందులో ఎంతవరకు ఉంది? 'తెలంగాణా ప్రజలను మోసంచేసి చాలా అభివృద్ధి చెందారు' ఇందులో మోసాల ప్రసక్తి హేయమైన భావన యిక అభివృద్ధికి చూస్తే జంట నగరాలు తప్పించి రెండు ప్రాంతాలలోనూ చెప్పుకోదగ్గ అభివృద్ధి ఏమీ సాధించలేదు. నాగార్జునసాగర్ నిర్మాణంలో ప్రభుత్వం యిరు ప్రాంతాలకు వాడుకునే నీటిని బేరీజువేసి ఖర్చులను నిర్ణయించారు పూర్వపు మంత్రివర్గంతో ఉన్న ఖర్చుల ఒప్పందం 32 ఆంధ్రా, తెలంగాణాలకు ఉండగా యిప్పుడు 21 మారింది యిది మరి ఎవరికి అన్యాయమో ఒకసారి ఆలోచించాలి. 'యిక ప్రాజెక్టుల లాభాలు' దొంగసర్టిఫికేట్లులతో ముల్కీలపై పెత్తనం చేస్తారని అనుకోవడం ఊహాకందని విషయాలు. ఏదో వ్రాస్తున్నాం అనిగాక వ్రాసింది ఎంతవరకు యదార్థమో గమనించి విమర్శను వ్రాస్తే ఎంతైనా సబబుగా ఉండేది

కె వి వి బ్రహ్మానందరావు (విశాఖపట్నం)

* * *

1969 పూర్వం తెలంగాణా, ఆంధ్రా అనే భేదం లేకుండా యిరువర్గాల ప్రజలు ఏకమార్గంలో పయనించారు. కొంతమంది స్వార్థపరులు ప్రజల తరపున, ఏదో అన్యాయం తెలంగాణా వారికి జరిగిందని (నిజంగా జరిగినదే) ఉపన్యాసాలు యిచ్చారు, ఉద్యమాలు నడిపారు, విశేషంగా ప్రాణనష్టం, ఆస్తినష్టం, ప్రభుత్వమునకు అనవసరమైన చికాకు కలిగించారు. వారే నేడు 1956 లో జరిగిన ఒప్పందం ప్రకారం నేడు తిరుగతోడడం న్యాయం కాదంటున్నారు (బహుశా వారెవరో మీరు గ్రహించే వుంటారు) మంచయినా చెడుఅయినా ఒక నిర్ణయం మీద తీసుకొన్న చర్యలుశాశ్వతం కావాలి కాని యిలా ప్రజలను ప్రభుత్వాన్ని వంచన చేసేవాళ్ళను ఏ న్యాయస్థానం శిక్షించగలదు? జరిగిన నష్టం భరిస్తున్న దెవరు? ఇలా ఇంకెంతకాలం జరుగుతుంది? ఇలాంటి వారిని నిర్మూలించడానికి మన రాజ్యాంగంలో ఏదైనా పరిష్కారం లేదా?

—వంగ రాంరెడ్డి (హైదరాబాదు)

* * *

నిరుడు యీ రోజుల్లో బంగ్లాదేశ్ చేసిన ధర్మ యుద్ధానికి సానుభూతిచూపి, యాహ్యాఖాన్, టిక్కాఖానులను అందరూ దూషించారు. రావణాసురుడి కాష్ఠంలాగ వియత్నాం యుద్ధాన్ని తీవ్రతరం చేస్తున్న నిక్సన్ ప్రభుత్వాన్ని ప్రపంచమంతా దుయ్యబడుతున్నారు కాని, నేడు భారతదేశంలకిని ఒక రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌లో సాగుతున్న మారణ హోమం, దమననీతి దుర్నీతి దుష్పరిపాలన, కవ్వింపు చర్యలు శాంతినే కాంక్షించే భారత ప్రభుత్వం సాగిస్తోందంటే ఆపేవారు, అధిక్షేపించేవారు లేరే! కాంగ్రెసు బరిఖాలో గద్దెపై కూర్చుని కవ్వింపు నిస్సుల దుష్పరిపాలన ప్రవృత్తిని ఆచరిస్తున్న ప్రధానిని, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని శిక్షించేవారు లేరే! 'ముల్కీ' గొడవను ఎనీపాటులేక ప్రేరేపించిన ప్రభుత్వాన్ని క్షమించకూడదు. అమాయక ప్రజానీకాన్ని పొట్టన బెట్టుకున్న ప్రభుత్వం యిప్పటికైనా కళ్ళు తెరిచి ప్రజాభీష్టాన్ని మన్నించి తీరాలి లేదా, ప్రజావాహిని ఉప్పొంగి పోయిందంటే ఎన్ని చట్టాలు, ప్రభుత్వాలువున్నా, ఆ ప్రవాహంలో కొట్టుకుని పోకతప్పదు.

ఏ. ఎస్ చక్రవర్తి, (విజయవాడ).

* * *

అత్యున్నత న్యాయస్థానము ఇచ్చిన తీర్పును రద్దు చేయాలని ఆంధ్రు ప్రజలు ఎలా కోరుతున్నారో అర్థం కావటం లేదు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమము కూడ అర్థం కావటం లేదు తెలంగాణాలో గెజిటెడ్ మరియు నాన్‌గెజిటెడ్ ఉద్యోగాలలో ఆంధ్రవారే చేరిరి పోని తెలంగాణా వారికి ఆంధ్రలో ఉద్యోగ అవకాశాలు వున్నవా అవి లేవు. అంటే తెలంగాణ వారికి ఉద్యోగ అర్హతలులేవా? ఇక తెలంగాణాకు పెట్టిన ప్రాంతీయ సంఘం, ప్రత్యేక బడ్జెట్ వలన ఏ జిల్లా అయిన అభివృద్ధి అయినదా అదీ లేదు ఏ రక్షణలు కల్పించని ఆంధ్ర ఏవిధంగా అభివృద్ధి చెందుతున్నాందో మరి! 1969 లో జరిగిన తెలంగాణ ఉద్యమమును కొందరు రాజకీయ నాయకులు మంత్రి పదవులకు ఆశపడి చల్లార్చారు. తెలంగాణాలోని ఉద్యోగఅవకాశాలు చేసి తెలంగాణ ప్రజలు, ముల్కీ రూల్స్ కాలపరిమితిలో నిమిత్తము లేకుండా అమలు చేయమనడంలకి తప్పు లేదు.

ప్రజల న్యాయస్థానాన్ని ధిక్కరించే అధికారంగాని నవరించే అధికారంగాని ఏ ప్రజా ప్రభుత్వానికి లేదు కాని మన ప్రభుత్వము చేసిన పని మనకే అవమానము. ముల్కీ రూల్స్ రద్దుచేయకపోతే ప్రత్యేక ఆంధ్రయే శరణ్యమంటున్నారు. ఆ మాట నిజమే! సమైక్య వంటాయి వేరుకాలేదు తెలుగు గడ్డ వేరు కావద్దు అంటున్నారు కద కొందరు కలసివుండి ఒకరినొకరు అసహ్యించుకోవడం దెబ్బలాడు కోవడం వారికి ఇష్టము కావచ్చు ఆంధ్ర, తెలంగాణ కలిసి బ్రతకటం ముందుముందు తెలుగు రాష్ట్రానికే ప్రమాదం త్వరలో తెలంగాణ నుండి ఆంధ్రను వేరు చేయడమే చాల మంచిది ఇక్కడ ప్రజలు సుఖంగ జీవించాలంటే కేంద్ర ప్రభుత్వము వేర్పాటు బిల్లును లోకసభలో ప్రవేశపెట్టాలని నేను కోరుతున్నాను.

పత్రికలవారు ఏ పక్షపాతము లేకుండ ఈ లేఖను ప్రచురిస్తారనుకుంటాను.

యస్ రాధాక్రిష్ణ, (వల్లబొల్లి

* * *

5—1—73 సంచికలో టి ప్రసాద్‌గారి వ్యాసం 'ఆకాశవాణి, ప్రధానివధకం' సమంజసంగా ఉంది ఈ వ్యాసంలో ఆకాశవాణి వైఖరిని వాస్తవంగా చిత్రీకరించారు. నేడు 'ఆకాశవాణి' వైఖరి గమనిస్తే చాల విపరీతంగా, ఆక్షేపణీయంగా కావవస్తుంది కనుక 'ఆకాశవాణి' ఏ (అధికార) పార్టీతోను ప్రమేయం లేకుండా స్వతంత్ర ప్రతిపత్తి కలిగినదిగా



# ఉత్తరాలు

ఉండాలి అప్పుడు మాత్రమే మనం సత్యాలను విన గలుగుతాం ప్రజలు చెవులు మూసుకొని కళ్ళతో చూచి గమనించవలసిన సమయం ఆసన్నమయిందన్న ప్రసాద్‌గారి అభిప్రాయాలుతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను

లింగప్రసాద్, కె ఎమ్వీ, (నందిగామ)

*　　*　　*

8–12–72 పత్రికలో వి మధుసూధన్‌రావు గారి మనం తెలుగువాళ్లం వ్యాసం సమంజసంగా లేదు ఆంధ్రప్రదేశ్ అవతరణకు మనమే కొట్లాడాము అని వ్రాసారు కాని తెలంగాణావారు ఆంధ్రప్రదేశ్ అవతరణకు ఎన్నడూ సుముఖంగా లేరు తెలంగాణా వెనుకబడినది కాబట్టి తెలంగాణాకు ప్రత్యేకంగా కొన్ని సదుపాయాలు సమకూర్చుతామని, నాయకులు తెలంగాణా వారిని నమ్మించి ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగేలా చూశారు ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో కూడా ముల్కీనిబంధనలు అమలు పరుస్తామని హామీ ఇచ్చారు కాని ఇంతవరకు అమలు ఏమాత్రం జరుగలేదు

కోర్టు తీర్పువల్ల అల్లర్లు జరుగుతున్నాయని మధుసూధన్‌రావుగారు తమ వ్యాసంలో పేర్కొన్నారు. అయితే కోర్టు అల్లర్లు జరగాలని తీర్పు ఇస్తుందని నేననుకోను కోర్టు న్యాయ ప్రకారంగా తీర్పు ఇచ్చింది.

ఇంతకూ ఈ సమస్య కోర్టు వరకెలా వెళ్లింది? దీని తెరవెనుక వున్న నాయకులెవరు? అన్నది ఎవరికీ తెలియదు. కోర్టు వరక తీసికెళ్లిన నాయకులకు ప్రజలలో కల్లోలం సృష్టించాలని వుంది ఎందుకనగా కోర్టు తీర్పు ఎలాగయినా వుండనియండి. అల్లరి మాత్రం తప్పదు ఎందుకంటే ముల్కీరూల్సు అమలు పరిస్తే ఆంధ్రులు గొడవచేస్తారు. అమలు పరచక రద్దుచేస్తే తెలంగాణావారు గొడవ చేస్తారు ఈ సంగతి నాయకులకు తెలుసు అందుకని ఈ గొడవ లేపిన నాయకులననాలి కాని కోర్టును నిందించడంలో మధుసూదన్‌రావుగారి ఉద్దేశ్యం నాకు బోధపడలేదు

తమ వరకు వస్తేనేగాని ఎవరికీ తెలియదు తెలంగాణావారు, ప్రత్యేక తెలంగాణా కావాలని పోరాడి 360 మంది మరణించినపుడు ఆంధ్రులు పట్టించుకోలేదు ఇప్పుడు ఈ సమస్య (ముల్కీరూల్సు) రావడంలో విశాలాంధ్ర కావాలంటున్నారు ఏదిఏమైనా గాని ఎవరికివారు విడిపోవడమే దీనికి సరియైన మార్గం విడిపోకుండా ఏ పంచసూత్రాలూ దీనిని అరికట్టలేవు

కడారి సంపత్‌రావు, నీరుకుళ్ళ, (వరంగల్ జిల్లా)

*　　*　　*

'తెల్లు నదులెల్ల పొంగెత్తె ప్రళయవారి
కెరలు పడ తెల్గునేల మునిగించ నిమ్ము
నేటితో నస్వతంత్రతా నియతమయిన
ఈ బ్రతుకు తెన్గువారు భరించలేరు'

అని దశాబ్దాల క్రిందట ఏ కవి కుమారుడో ఆక్రోశించేడు ఆ వాక్కులు ఈనాడు స్మృతి పథంలో మెదిలే పరిస్థితులు తిరిగీ ఆంధ్రావనిలో తల ఎత్తడం నిజంగా శోచనీయం ఈ పరిస్థితులకు తెలుగురక్తం వున్న ప్రతివాడు ఎంతగానో బాధపడుతున్నాడన్నది నిర్వివాదాంశం ప్రవాసాంధ్రుల తరపున రాష్ట్రవాసుల కొక విన్నపము! మీ కోర్కెలలో మాకు పూర్తి సానుభూతి వుంది కాని హింసాకాండకు దిగి రైళ్లనూ, బస్సులనూ గవర్నమెంటు ఆఫీసులనూ తగుల బెట్టడం పెద్దలెవరూ హర్షించరు పరిస్థితి విషమించకుండా అదుపులోకి పెట్టే బాధ్యత మన నాయకులందరి మీదా వుంది అహింసాయుతమయిన పోరాటంతో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూకటి వ్రేళ్లతో పెల్లగించే ఆ అధ్యాత్మక శక్తి మనలకి బాపూజీ మరణంతో నశించిందా? మీ సమరం సాగవలసిందే ఢిల్లీలోని పెద్దలు చెవుల దాకా మీ ఆక్రందన వినవడేలా పోరాడండి హింసాయుత చర్యలను విడనాడండి నష్టపోతున్న రైలు వారి ఆస్తి మనదే! తగులబడుతున్న బస్సులు మనవే! మన చేతో మన కన్నుని పొడుచుకుంటామా? మీ ఆవేశాన్ని సందులు బట్టించకుండా చక్కని రాజమార్గంలో నడిపించండి మీకు కార్యసాఫల్యం తప్పదు ఇది ముమ్మాటికీ నిజం

'ఆ చళుక్యనృపాల పుంగవుల వియ్యమ్మంది శ్రీ కాకతి
క్ష్మా చక్రేశుల పాలనన్ వడసి కృష్ణప్రాజ్య సామ్రాజ్య శ్రీ
రీ చంచజ్జయ కన్యతో సరసగోష్ఠిన్ ప్రొద్దు వో బుచ్చు నీ
ప్రాచీనాభ్యుదయంబు నెన్నెదము గర్వస్ఫూర్తి ఆంధ్రావనీ'

బరంపురం రంగారావు, (బరంపురం)

*　　*　　*

'ఉత్తరాల శీర్షిక'లో ప్రత్యేక ఆంధ్ర గురించి ఈమధ్య ప్రచురితమైన ఉత్తరాలు చాల బాగున్నవి. అది బాగుంది, ఇది బాగుంది అని గొప్పచెప్పుకునే బదులు నడుస్తున్న చరిత్ర గురించి ఉత్తరాలు వ్రాయడం విజ్ఞానదాయకంగాను, వినోదంగాను ఉన్నది. ఆంధ్రులు ఆరంభశూరులు' అని నాయకులంతా కదలక ఉన్నారేమో? ఆంధ్రులు సహనం కోల్పోయారు ఇక దాని అంతం చూసేవరకు నిద్రపోరు ఏదిఏమైనా వేరు చేయడమే ఆంధ్రుల ఏకైక లక్ష్యం ఇప్పుడైనా నాయకులంతా కళ్ళు తెరచి నిజంగ్రహిస్తే ఎంతో మంచిది లేకపోతే 'అంతం' అనేది ఎంతవరకు దారితీస్తుందో చెప్పలేము జై ఆంధ్ర!

కె రషీదాబేగం, కె. నసీమ్‌బేగం, కె జాహెదా బేగం, ఖాన్‌మంజిల్, (కొంజూరు).

## పోషలిజం

మన దేశంలో —కార్లలోనూ, బంగాళాల్లోనూ —వేదికల మీదా మాత్రమే దొరుకుతూంది, సోషలిజం ఏం చేద్దాం?

అన్నం దొరక్క అలమటించే ప్రతివెధవా, దుర్మార్గుడుసార్! అటువంటి వాళ్ళందరూ ఘోర విద్రోహక శక్తులు. వాళ్ళను పూరికే వదలకూడదు. ప్రమాదకరమైన వ్యక్తులు

వి మధుసూదనరావు, (హైదరాబాదు)

## తండ్రి కూతురు

ఆంధ్రలో పరిస్థితి నానాటికి అధ్వాన్నం అవుతున్నందుకు కన్నీరుగార్చే ప్రవాసాంధ్రులలకినే కొకణ్ణి. తండ్రి కళ్లు తెరిపించడానికి ఒక పొట్టిశ్రీరాములు కావలసివచ్చేడు కూతురు కళ్లు తెరిపించడానికి ఎంత మంది పొట్టిశ్రీరాములు కావల్సిందో తెలియదు. ముల్కీ నిబంధనలన్న మునళ్ళంలో ఢిల్లీలోని పెద్దలు ఎందుకిలా ఆడుకుంటున్నారో అర్థంకాదు. భారత దేశములో విలీనమయిన స్వతంత్ర సంస్థానాలన్నిటిలో అప్పటికి అమలులో వుండే నిబంధనలన్నీ విలీనమయిన నాటినుండి రద్దు అయినట్టు పార్లమెంటు ఒక చట్టం పాస్ చేస్తేపోలే? ఎందుకీ మధ్యమార్గాలు ఎందుకీ కుదరని పొత్తులు? ఆంధ్ర, తెలంగాణాలు విడివిడిగా రెండు రాష్ట్రాలుగా విభజించని పక్షంలో ఇరు ప్రాంతాలలో వున్న కాంగ్రెస్సు సభ్యులందరూ మూకుమ్మడిగా కాంగ్రెస్సు నుండి వైతొలగుతామని ప్రధానికి తెలియజేయాలి కాంగ్రెస్సుని రద్దుచెయ్యమని ఏనాడో బాపూజీ మొరపెట్టుకున్నాడు పాలకులు ఆ మాటలు విననందువల్లనే దేశంలో ఇన్ని సంక్షోభాలు బయలుదేరేయి ఆంధ్రులకిక కాంగ్రెస్సులో స్థానంలేదు వేగంగా వైదొలగండి

జి వీరావారి, (బరంపురం)

## శోభ

నటసార్వభౌమ శోభన్‌బాబు గారి ముఖచిత్రం ఆంధ్రసచిత్రవారపత్రికకే ప్రత్యేక 'శోభ' ను చేకూర్చినదని తెలుపుటకు సంతోషించుచున్నాను

ఆసక్తికరమైన శీరి కలతో ప్రతివారం ఆంధ్ర సచిత్రవారపత్రిక అన్ని తరగతుల పాఠకులకానందం గలుగజేయుచున్నదనడములో సందేహములేదు

బి. భాస్కర్‌కుమార్ బి ఎ., (కర్నూలు)

## కార్టూన్

గత సంచికలో ఒక్క తెలంగాణాయువతిని ఒక్క ఆంధ్ర యువకుడు, శాసనం అనే పురోహితుని సమక్షములో వివాహము చేసుకొంటున్నటుగా, భగవన్ గారు కార్టూన్ వేసారు

అది చూచి నేను చాలా విచారిస్తున్నాను, ప్రస్తుతము రాష్ట్రములో పరిస్థితి తీవ్రముగా యుండి, ఆంధ్ర ఉద్యమము అతితీవ్రముగా యుంది ఆంధ్ర ఉద్యమాన్ని తెలంగాణా వారు బలపరుస్తూనే, యున్నారు తెలంగాణ ప్రజలు ముందుగానే ప్రత్యేక తెలంగాణా కావలయునని కోరియున్నారు మరి అలాంటప్పుడు తెలంగాణా ప్రజలను కించపరుస్తూ భగవాన్ గారు కార్టూన్ వేయుటం ఏమీ బాగులేదు ఒక్క 'ఎం పి'ని దృష్టిలో పెట్టుకొని కార్టూన్ వేయవచ్చుకాని మరి ఇంకోరకంగా వేయవలసినది కాని ఇలా కాద! ఎంతైనా భగవాన్‌గారి కార్టూన్ చూచక నేను చాల బాధపడ్డాను—

పల్లగాని రామనర్సయ్య (డోర్నకల్)

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Editor : S. Radhakrishna.

